శ్రీరామ నమః

# అలాఉద్దీన్ అద్భుతదీపం కథ

రచయిత :

సహస్రావధాన ఫణీంద్ర, సహస్రావధాన వాచస్పతి, సహస్రావధాన చతురానన, సహస్రావధాన పంచాననాద్యనేక బిరుదాంకిత, పంచసహస్రావధాని

శ్రీ

జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి

ప్రకాశకులు :

కొండా శంకరయ్య

బుక్ సెల్లర్ అండ్ పబ్లిషర్స్

సికింద్రాబాద్, హైదరాబాద్ & వరంగల్.



1958 వెల 1-0-0

# హెచ్చరిక

—:o:—

ఈ అలాఉద్దీన్ అద్భుతదీపం అను పుస్తకము యొక్క సర్వాధికారములు మాకే జెందియున్నవి. కావున యితరులు ఈ పుస్తకమును యేమాత్రము ముద్రింప గూడదు. అట్లు ముద్రించినచో మేము చేయబోవు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురని యిందుమూలముగా తెలియపరచబడినది.



—

 

# అల్లాఉద్దీన్ అద్భుతదీపం కథ

:o:

చైనాదేశమున నొక ప్రసిద్ధ నగరమున ముస్తఫా యను నొక కుట్టుపనివాడుండెను. అతనికొక్కడే కుమారుడు. అతడు కుట్టుపనిచేసి భార్యను కుమారుని కడుంగడు పేదతనముతో బోషించుకొనుచుండెను. అతని కుమారుని అలాఉద్దీనని పిల్చుచుండిరి. ముస్తఫా మిక్కిలి బీదవాడగుటచే దనకుమారునకు పెద్దగా విద్యాభ్యాసము చేయింపలేకపోయెను. కాలక్రమమున అతని కుమారుడగు అలాఉద్దీనుకు చెడ్డవారి సహవాసము కారణమున పెక్కులు దురభ్యాసములు పట్టుబడెను. అలాఉద్దీన్ ప్రొద్దున తలిదండ్రులను బెదరించి పొట్టనింపుకొని బయటికిబోయి తోటిబాలురతో యిష్టానుసారముగ ఆటలాడుచు, బజారులవెంట వ్యర్థముగా దిరుగుచు దినమెల్ల గడపి సాయంకాలము వరకు యిల్లుజేరుకొను చుండెడువాడు. సంపూర్ణ యౌవనము పైబడినతరువాత కుమారున కేదైన నొక వ్యాపారము నడుపు రీతి యలవడకపోయెనని విచారించుచుండెను. కులవృత్తి యగు కుట్టుపని మాత్రమెట్లో నేర్పెను. అలాఉద్దీను కుట్టుపనియైనను సరిగా చేయక సోమరిపోతుగా దిరుగుచుండెడివాడు. కుమారుడు సరియైన ద్రోవకు రాకపోయెనని విచారించి, కృశాంగుడై, వ్యాధిగ్రస్తుడై యుట్టతుదకు ఆ విషాదముతోనే ముస్తఫా ప్రాణములు విడిచెను.

తండ్రివృత్తిని కుమారు డవలంబింపక పోవుటయు, ఇతరవ్యాపారమేమియు లేకబోవుటయు, సంసార నిర్వాహణ భారము తల్లిపై బడెను. తల్లి ఒంటరిగా కుట్టుపనిచేసి సంసారము నిర్వహించుకొనలేక పోయెను. కుమారుడు చేయు దుర్వ్యయము ఎక్కువఅయ్యెను. సొమ్ముఅవసరము అధికమయ్యెను. బాకీలు మితిమీటెను. అప్పుడు తల్లి కుట్టు యంత్రమును దానికి సంబంధించిన యితర సామానును లోకులకు అమ్మివేసి, బాకీబాధలు తొలగించుకొని యాబీద రాలు దూదివడకి యిల్లు గడపుటకు బూనుకొనెను. తండ్రి మరణించిన తరువాత తల్లి యేమియాజ్ఞాపించినను వినకుండుటయే గాక, పైనుంచి ఆమెను నిందించుటయు నలాఉద్దీనుకు అలవాటయ్యెను. ఉదయము మొదలుకొని సాయంకాలమువఱకు వీధులలో సోమరిపోతులైన తనమిత్రులతో నాడుకొనుటయే గాని యతనికి రెండవపని లేదయ్యెను.

ఒకనాడు అలాఉద్దీను రివాజు ప్రకారము వీధిలో నాటలాడుచుండగా నొక మాంత్రికుడు కనబడెను. అతడు ఆఫ్రికా మాంత్రికుడని పిలువబడుచుండెను. అతనికి సాముద్రిక శాస్త్రము దెలియును. ఆఫ్రికాదేశమునుండి యతడు అప్పటికి రెండుదినములకు పూర్వము మాత్రమే చీనా దేశమునకు వచ్చియుండెను. కాని యతడొక కార్యము సాధించుటకై బయలుదేరెను. అతడు సాముద్రిక శాస్త్రజ్ఞాత యగుటచే అతనికి కావలసిన మనుష్యుని యొక్క



ముఖ లక్షణములు అలాఉద్దీనునం దగపడుటచే, ఆ బాలుని యతని చెలికాండ్ర సంఘమునుండి యావలికి బిలిచి, యా మంత్రగాడు "అబ్బాయీ నీతండ్రి పేరు ముస్తఫా కాదా" యని అలాఉద్దీను నడిగెను. అందుల కలాఉద్దీను "అయ్యా ! అవును. కాని యతడు చిరకాలముక్రిందనే కాలధర్మము నొందె"నని జవాబుచెప్పెను. ఆమాటలువిని, ఆ యాఫ్రికా మాంత్రికుడు అలాఉద్దీనును గౌగిలించుకొని కన్నీరువిడచెను. అలాఉద్దీను సంసార పరిస్థితిని గుఱించి యితరులనుండి జాగ్రత్తగా మునుముందే తెలిసికొని యతనిపట్ల నీచర్య నారంభించెను. అలాఉద్దీను బాలుడగుటచే ఈమాంత్రికుడు కృత్రిమపురుషుడని తెలియక, మోసమునకు లోబడెను. మాంత్రికుని కన్నీరుచూచి "అయ్యా నీవిట్లు కన్నీరుగార దుఃఖించుట కేమికారణమని యడిగెను. అంత నామాంత్రికుడు "నాయనా ! నేనెట్లు సహింతును. మీతండ్రికి నేను తమ్ముడను,

నీకు నేను పినతండ్రిని. చిరకాలముక్రిందట నేను ఇల్లువిడచి దూరదేశయానము సేసితిని, నాయన్నను చూడవలయునని ప్రేమతోదిరిగివచ్చితిని. నాకు ఆశాభంగము కలిగినది. కాని నీవు నీతండ్రిని బోలియుండుటచే నిన్ను చూచినమాత్రమున నాకొక యింత మనశ్శాంతి కలిగినది. ప్రస్తుతము మీతల్లి యెక్కడనున్నదో నాకుదెలుపు"మనెను. ఇట్లడుగుచు నతడు తనజేబులో చేయిపెట్టెను. అలాఉద్దీను ప్రస్తుతము తన తల్లియు దానును నివసించు నింటి విలాసముచెప్పెను. అంత నా మంత్రికుడు అలాఉద్దీనుకు కొద్దిపాటి సొమ్మిచ్చి "కుమారా నీవింటికిబోయి నీతల్లికి నాప్రేమవాదము చెప్పుము. నేను రేపు తీరుబాటు చూచుకొని మీయింటికి వచ్చెదననుము. చిరకాలము నాయన్న నివసించి యును డుయు తొలంగిన స్థానమును నేను రేపు చూడదలంచియు న్నానని యామె కెఱుకపఱుపుము." అని చెప్పి యెచ్చటికో వెడలిపోయెను.

అలాఉద్దీను సరాసరియింటికివచ్చి, తల్లితో "అమ్మా: నాకొక పినతండ్రిగలడా ?" అని అడిగెను. ఆమె తొలుత "నాయనా! నాకుగాని మీతండ్రికిగాని సోదరులు లేరనెను. తరువాత అలాఉద్దీను "అమ్మా నేను ఇప్పుడే ఒక పెద్ద మనుష్యుని కలిసి వచ్చినాను. అతడు నావంకజూచి నీవు ముస్తఫా కొడుకువా అని అడిగెను. "అవును, మాతండ్రి మరణించి కొండొకకాలమైన" దంటిని. అంత నతడు దుః

ఖించి "నేను మీతండ్రి సోదరుడను. ఈవార్త నాకు మహా దుఃఖము కలుగజేసినది నేను తీరుబాటుకలిగినచో రేపువచ్చి మీగృహమును జూచెదను." అని పల్కి నాకీ ద్రవ్యము నొసంగెను. నామాట యసత్యమైనచో యీబంగారు నాణె ములను జూడుమని అందుకు నిదర్శనముగా మాంత్రికుడు తనకిచ్చిన సొమ్మును జూపించెను. అప్పుడామె పూర్వవృ త్తాంతము జ్ఞాపకము చేసికొని, "కుమారా! నిజము. మీ తండ్రికొక సోదరుడుండెను. కాని అతడు చిరకాలము క్రింద చనిపోయెనని వింటిని." అని వచించెను. మఱియొక సోదరు డున్నసంగతిని గుఱించి నేనెన్నడును వినియుండ లేదనియు బల్కెను. ఆరాత్రి వారామాంత్రికుని గుఱించి మఱేమియు బ్రసంగించలేదు.

మఱునాడు అలాఉద్దీను ఆనగరమున మఱియొక భాగమునం దనమిత్రులతో నాటలాడుకొనుచుండగా, తిరిగి ఆఫ్రికా మాంత్రికు డచ్చటికి వచ్చెను. అలాఉద్దీనును సమీ పించి తిరిగి యతడు వానిని కౌగలించుకొని రెండు బంగారు నాణెములను బాలునిజేబులో వేసెను. మఱియు "కుమారా! ఈద్రవ్యము మీతల్లికిమ్ము. నేను ఈసాయంకాలము మీ యింటివద్దనే భోజనముసేతును. కొన్ని యాహారపదార్థము లను దెప్పించుమని చెప్పుము. కాని ముందుగా మీయిల్లు నాకు జూపుమని యడిగెను, అలాఉద్దీను మాంత్రికుడు కోరినప్రకారము తాము నివసించు గృహమును జూపించి

మాంత్రికుని పంపివేసెను. తరువాత కొంతసేపటికి అలా ఉద్దీను గృహమునకేగి తల్లితో "అమ్మా! మాపినతండ్రి నేటిరాత్రి భోజనమునకు వచ్చెదననియు "ఈ రెండుబంగారు నాణెములు తీసికొని, వలసిన భోజన పదార్థములను దెప్పించు"మనియు జెప్పెను. ఇట్లు ప్రసంగించి యానాణెముల నతడు తన తల్లికొసంగెను. ఆమె వెంటనే తినుపదార్థములను దెప్పించి యిరుగు పొరుగు యిండ్లలో కొన్నిపాత్రల నడిగితెచ్చి భోజనము తయారుచేసెను. కొంతతడవెదురు చూచి "కుమారా! నీపినతండ్రికి మనయిల్లు తెలియునో లేదో! నీవుపోయి యాతని నిచ్చటికి దోడ్కొనిరమ్మని చెప్పెను. అంతలో తలుపుచప్పుడు వినబడెను. అలాఉద్దీను తల్లి యానతి ప్రకారము తలుపు తెఱచెను. మాంత్రికుడు లోనికి బ్రవేశించి తనవెంట గొనివచ్చిన సారాయి సీసాలను భోజనానంతరమున నుపయోగింప సర్హములగు పలు జాతులపండ్లును, వారికిచ్చెను. మఱియు నామాంత్రికుడు అలాఉద్దీనుతల్లికి వందనముచేసి "నాయన్నయగు ముస్తఫా కూర్చుండు మామూలుచోటు చూపుమనెను. వారు, ముస్తఫా కూర్చుండియుండెడు సోఫాను చూపగా నతడు దాని ముందు సాగిలబడి, పలుసార్లు దానిని ముద్దుపెట్టుకొనెను. మఱియు నతడు కన్నులనీరునింపి "అన్నా! నిన్ను చిట్టచివర కొకసారి కౌగలించుటకు యింతకు ముందుగా రాసైతినిగదా" యని విలపించెను.



కొంతసేపయిన పిమ్మట, అలాఉద్దీసుతల్లిలో సంభాషింపజొచ్చెను. "సోదరీ! నీవు నన్నిదివరకెన్నడు చూచియుండలేదని నివ్వెరపోకుము. నేనును నాయన్నయును నీదేశములో పుట్టినవారము. నేను నలుబది సంవత్సరముల క్రిందట నీదేశము విడిచి పరదేశ సంచారముచేయుచుంటిని. ఇండీసు, పర్షియా అరేబియా, సిరియా, ఈజిప్టు మున్నగు దేశములందు సంచారముచేసి, ఆయాదేశ ముఖ్యనగరములలో కొంతకాలము గడపితిని; తరువాత ఆఫ్రికా దేశమునకుబోయి యచ్చట పెద్దకాలము దనుక నివసించితిని. ఎంతదూరమున నెంత కాలముదనుక నివసించినను, మానవునకు, తన జన్మభూమి యందును, బంధుమిత్రుల యందును, పరిచితుల యందును ననురాగముండుట సహజము గనుక మిమ్మునెల్లరను శరీర బలము తగ్గకముందే యొక్కసారి చూడవలయునను నపేక్షతో బయలుదేరితిని. ఈ ప్రయాణము నాకెంత కాలము పట్టినదో, త్రోవలో నెన్నెన్ని చిక్కులువచ్చినవో, నేనంత

కష్టపడి యిక్కడికి జేరితినో అవియన్నియు చెప్పి మీకు మనోబాధ కలుగజేయుట నాయభిమతముగాదు. కాని నా యన్నగారు మరణించెనను వార్త మాత్రము నా కన్నికష్ట ములకంటె నధికబాధ కరమైనది. ఈ మరణవార్త విన్న ప్పుడు నామనస్సెంత పరితపించినదో నీకుమారుడే చెప్ప గలడు. గతించిన విషయముతో నేమి ప్రయోజనము? నా యన్నగారి ప్రతిబింబమని చెప్పదగిన ఈపిల్లవాని లక్ష ణములు నాకు మనశ్శాంతి కలుగజేసినవి. తండ్రి పోలికలు ఇతనియం దెన్నో గలవు.

అలాఉద్దీనుతల్లి, తనభర్తను గురించిన విశేషములు జ్ఞాపకము సేయబడినప్పుడు, కన్నులనిండ నీరునింపి, మి క్కిలి దుఃఖించెను. ఈ విషయము నామాంత్రికుడుగ్రహించి సంభాషణమును వేరుమార్గమున బెట్టెను. ఆబాలుని బిల్చి "నాయనా నీపేరేమనెను. అతడు నాపేరు అలాఉద్దీన్ అని జవాబు చెప్పెను. నీవేమి వ్యాపారము చేయుచున్నావని మాంత్రికుడు తిరిగి ప్రశ్నించెను. అలాఉద్దీను యేమియు ననకుండెను. అంత నా యనాథ, అయ్యా! అలాఉద్దీను కేవలము సోమరివాఁడు. తండ్రి బ్రతికియున్నంతకాలము, ఇతని నేదో ఒక వ్యాపారములో ప్రవేశపెట్టవలెనని చాల ప్రయత్నించెను కాని ఇఁతడు త్రోవకు వచ్చియుండలేదు. ఈమనోవ్యాధితో ఇతనితండ్రి కృషించి మరణించినాడు. తరువాత నేనెంతయో చెప్పుచున్నాను. కాని నామాటలులక్ష్య

పెట్టలేదు. దూదివడకి నేను బీదసంసారమును నడుపుచున్నా ను. ఇఁక నావలనకాదు. కొద్దిరోజులలో నేనితని నిల్లు వెడలఁగొట్టి "నీకై నీవు సంపాదించుకొని జీవించుమని చెప్ప దలచుకున్నాను." అని పెద్దపెట్టున రోదనము సేసెను.

అంతమాంత్రికుడు అలాఉదీనువంకజూచి "కుమారా ఈసంగతి బాగుగాలేదు. నీపొట్టకు నీవు సంపాదించుకొని జీవించవలయును. ప్రపంచమున నెన్నోవృత్తులున్నవి. మీ తండ్రివృత్తి నీకురుచింపకపోవచ్చును. నీకే వ్యాపారమునం దభిరుచియున్నదో దానిని నాకు జెప్పుము. నేను నీకుసంపూర్ణ సాహాయ్యము జేయుదును. నీవేవృత్తి నవలంబించుటకును నభిలషింపనియెడల, నేను నీకొఱకు ఒకదుకాణము కొనియె దను. అందులో పట్టుబట్టలు ఉన్నిదుస్తులు మున్నగునవి కొనియుంచెదను. నీవు వ్యాపారముచేసి, వచ్చినలాభముతో విలువగల వలువలు వేసికొనుము. అప్పుడు నీవు గొప్ప గౌరవముతో జీవింపగలవు. నీకేది యిష్టమో ఆలోచించి చెప్పుము. నేను ఆడినమాట తప్పనివాడనని నీవేతెలిసికొన గలవు." అని బోధించెను. అలాఉద్దీను నగరములో నిట్టి విలువగల అంగడులు పెక్కులు గలవనియు, నాయా యంగళ్ళ వ్యాపారస్థులు పెద్ద గౌరవము పొందుచుందుర నియు నెఱుంగును. అందువలననతడు ఆరీతి దుకాణములో కూర్చుండి వ్యాపారము సేయుట తనకిష్టమని వ్యక్తపఱి చెను. అతనిభావము తెలిసికొనిన మాంత్రికుడు "నీవు రేప

టిదినమున నావెంటరమ్ము. ఈనగరములో నుత్తమోత్తమ వ్యాపారస్థులు ధరించు వలువలను నీచేతఁ దాలిపించెదను. తరువాత నేను జెప్పినప్రకార మొకయంగడినిపెట్టి వ్యాపారము నడిపించుటకు బ్రయత్నించెదనని, సమాధానపఱచెను.

ఆమె అంతవరకు మాంత్రికుడు తన భర్తసోదరుడిని నమ్మియుండలేదు. కాని అలాఉద్దీనునం దతడుచూపిన ప్రేమానుబంధమును అతని యుదారబుద్ధిని బాలుని మేలుకొఱకు చేసిన వాగ్దానమును విని తరువాత, అతడురూఢిగా తనభర్త తమ్ముడేయని నిస్సంశయముగా విశ్వసించెను. పిల్లవానియందట్టి యభిమానము చూపినందు కామె యా మాంత్రికునకుఁ గృతజ్ఞతా వందనములర్పించెను. బాలుని జూచి "నాయనా! నీవు నీ పినతండ్రికి అనుగ్రహ పాత్రుడవు కమ్ము. మంచిమార్గము నవలంబించుము అని హెచ్చరించెను. పదంపడి యామె భోజనము సిద్ధపరచెను. భోజన సమయమున వారందఱు వివిధవిషయములనుగురించి సంభాషించుచు దనివిదీర భుజించిరి. తగుమాత్రము ప్రొద్దుపోవుటనుగాంచి మాంత్రికుడు సెలవుదీసికొనివెడలిపోయెను.

మాంత్రికుడు తాను వాగ్దానము చేసినప్రకారము, నాటి యుదయమున దిరిగి వారి గృహమునకు వచ్చి. అలాఉద్దీనును బజారుకు దీసికొనిపోయెను. విలువగల తయారు దుస్తుల దుకాణమునకుఁ జేర్చెను. ఆయంగడిలో దొలుత ధనకష్టమైన దుస్తులను వాడు దీసికొనెను. తరువాత అలా

ఉద్దీనును దనకిష్టమైన కోటు, పంట్లాను మొదలగు వలువల నేరికొమ్మని వాని నలాఉద్దీనుకిప్పించి యాదుస్తులవెలను సంపూర్ణముగా దానిచ్చివేసెను. అలాఉద్దీను తన పినతండ్రి యౌదార్యమున కెంతయు సంతసించెను. మంత్రవేత్త యతని నెప్పటికి విడిచిపెట్టనని నమ్మకముగాఁజెప్పి, నగరములో విలువగల దుస్తులుగల పెద్ద యంగడులకు దీసికొని పోయెను. నీవు కొద్దికాలములో పెద్దయంగడి తెఱవబోవుచున్నావు. గనుక నీవు ఈపెద్ద విలువగల యంగడుల యజమానులతో బరిచయము గలుగజేసి కొనవలెనని బాలకునితో జేప్పెను. అక్కడనుండి అతడా బాలకునకు పెద్దవైన మహమ్మదీయ ప్రార్థన మందిరములను తరువాత పెద్దపెద్ద బాటసారుల విశ్రాంతి భవనములను జూపించెను. ఆవెనుక మాంత్రికు డతనిని సుల్తానువారి రాజభవనమునకు దీసికొని పోయెను. ఆరాజభవనములోనికి బోవుటకు మాంత్రికునకు లోగడనే యనుజ్ఞ దొరికియుండుటచే నతడలాఉద్దీనును రాజభవనముయొక్క లోపలిభాగమునకు దీసికొనిపోయి, సర్వమును జూపించెను. తుట్టతుదకా పిల్లవానిని దానుండు ధర్మశాలలోనికి దీసికొనిపోయెను. అప్పటికి సూర్యాస్తమయమయ్యెను. అలాఉద్దీను తన పినతండ్రి యనుజ్ఞదీసికొని యింటికిబోవనైన కాల మాసన్నమైనది. విలువగల దుస్తులు ధరించియున్న అలాఉద్దీనును తల్లిదర్శనము సేయుటకై యచ్చటికి దీసికొనిపోయెను. తల్లి కుమారుని

దుస్తులను జూచి మిక్కిలి సంతోషించెను. అంత విలువ గల దుస్తులను అలాఉద్దీను కిప్పించి నంశులకు ఆమంత్ర వేత్తను పలువిధముల యాశీర్వాదములతో గొనియాడెను. మాంత్రికుని వంకజూచి, అయ్యా ఇంత జేసిన మీకు నే నేవిధముగా గృతజ్ఞతసూపవలయునో యెరుగను. నాకుమారుని కొఱకు మీరు పెద్దద్రవ్యము వ్యయముచేసి శ్రమచేసితిరి. నాకుమారుడు సత్ప్రవర్తనుడై మీయందు గృతజ్ఞత జూపునంతవఱకు మీరు చూపిన యీకృపామయ కార్య క్రమమునకు ఋణముతీరదు. అని పలికెను. ఆమె కృతజ్ఞతావందనములు చిరునగవుతో నందుకొని మంత్రజ్ఞుడు "అలాఉద్దీను మంచిబాలుడు. ఇఁకముందు వృద్ధికి రాగలడు. కాని ఒక విషయమునకు విచారమును పొందుతున్నాను. రేపు శుక్రవారము బజారులోని అంగడులేవియు దెఱువబడి యుండవు. రెండవనాడు శనివారమునాడు గాని నావా. గ్దానము నెరవేఱజాలదు, ఐనను రేపటిదినమున నేనితనిని నగరోద్యానవనమునకు దీసికొని పోయెదను. ఏలనన ఇంత వరకు నితడు సోమరులగు చిన్నపిల్లలతో నాటలాడుచు, వ్యర్థముగా గాలక్షేపము సేయుచు దురభ్యాసములకు లోనయినాడు. నగరోద్యానమునకు నగరములోని పెద్దధనికులు గౌరవనీయులు విహారార్థముగా వచ్చెదరు. వారిలో గొందఱితో వీనికి బరిచయము గలుగఁజేసెదను." అని పల్కి ఆమెయొద్ద సెలవుతీసికొని నిజనివాసమునకు దరలిపోయెను.

మఱునాడు తూర్పు తెలవారు జామున నే నిదురలేచి అలాఉద్దీను తన ప్రాతఃకాల కృత్యములు ముగించుకొని, శుభ్రముగా దుస్తులు వైచికొని పినతండ్రిరాక కెదురుచూచు చుండెను. ఇంతలో తలుపు దగ్గఱకువచ్చి, మంత్రవేత్త యతని నాహ్వానించెను. కుమారుడు తనతల్లి యనుజ్ఞపొంది పరువు పరువున మాంత్రికుని డాసెను.

మాంత్రికు డతని నతిగౌరవముతోఁ గలిసికొని చెక్కిళ్ళు నవరించి కొనవేలుపట్టుకొని వెంటగొనిపోయెను. ముందొక నగరద్వారము వెలుపలి భాగమునకు దీసికొని పోయి యమూల్యములగు ధనికుల నివాస సౌధములను జూపెను. పిమ్మట నారాజ సౌధములకు సంబంధించి నగర ప్రజాసమూహములు దర్శింప నవకాశముగల వింతవింత యుద్యానవనముల లోనికి దీసికొనిపోయెను. అంత నట్లే పెద్దపెద్ద తోటలలో గట్టబడిన మహాసౌధములను జూపుచు క్రమక్రమముగా నతడలాఉద్దీనును నగరినుండి రెండుమైళ్ళ దూరములోఁ బ్రవహించు నొక సెలయేటియొద్దకు దీసికొని పోయెను. అచ్చటను నొక వింతదృశ్యముండెను. ప్రవాహోదకమొక లోహపుసింహము ముఖమునుండి తొట్టెవలె గట్టబడిన యొక విశాలమైన కట్టడములోనికి జాఱిపడునట్లు ప్రవహించుచుండెను. అచ్చట బాలునికి మనశ్శాంతిసెప్పి యాజిత్తులమారి మాంత్రికుడు శ్రమనభినయించి "కుమారా! చాలదూరము దిరుగుటచే నీవును అలసట చెందియుందువు.

నాకును నాయాసముగా నున్నది. ఇచ్చట నిర్మలమైన యుదకమున్నది. కావున మనమిరువురము నించుకకాల మిందు విశ్రమించెదమనెను. బాలు డందులకు సమ్మతించెను. వారుభయులును నాయుపతీరమున గూర్చుండిరి. మాంత్రికుడు తనయొద్దనున్న జేబురుమాలులోని రొట్టెలను బలురకముల పండ్లను బయటికిదీసి యొక యాకులో విడివిడిగా బెట్టెను. వారుభయులును యథేచ్ఛగా భుజించి సెలయేటిలోని నిర్మలోదకము ద్రావి యలసట దీర్చుకొనిరి. కొంత తడవయిన తరువాత నాటక్కరి మాంత్రికు డింకను ముందు విచిత్రకరములైనతోటలున్న వని దీసికొని పోవుచు ఏమేమో తీయతీయని మాటలుసెప్పుచు, యేవేవో యాశలు గొలుపుచు దాదాపు ఒక మహాపర్వత పాదమునకు గొంపోయెను.



అప్పటికాచిన్నవానికి శ్రమయనిపించి "చిన్నయ్యా? మనమొక పెద్దదూరమున నున్న మహాపర్వతమునకు వచ్చినాము. ఇచ్చటనుండి నేను

మఱల నింటికి బోగలుగుదునా యను సంశయము కలుగు చున్నది. ఇఁక మనము వెనుకకు దిరిగిపోరాదా" యనెను. మాంత్రికుడాతని మనఃపరిస్థితి గమనించి, "నాయనా! ఇంత వఱకు మనముచూచిన యుపవనములన్నిటికంటె నెక్కువ వినోదకరమును, నానందకరమును నయిన మఱియొక పెద్దతోటగలదు. అది యిక్కడకు చాల సమీపములోను న్నది. నీవు దానిని జూచితివేని "అయ్యో? యింత సమీప ములోనున్న యిట్టి మహావిచిత్రకరమైన యుద్యానవనమును నేను జూడనేక పోయితినిగదా యని పశ్చాత్తాపము నొందు దు"వని బదులుసెప్పి మెల్లమెల్లగ నడపించుచు, మార్గాయా సము గనపడనియట్లు వినోదకరములయిన కథలను చెప్ప నారంభించెను. తుట్టతుదకు వారు రెండు సామాన్య పర్వత ముల మధ్యనున్న యొకలోయలో బ్రవేశించిరి. ఈలోయ లోనే మాంత్రికుడు నిర్వహించవలసిన కార్యమున్నది. ఆటక్కరి మాంత్రికుడు ఈలోయలో నిర్వహించదగిన కార్యముకొఱకే ఆఫ్రికాఖండమునుండి చైనాదేశమునకు వచ్చెను.

అప్పుడా మాంత్రికుడు అలాఉద్దీనునుజూచి "కుమా రా! మనమింక ముందునకుబోవ నవసరములేదు. ఈ ప్రాంతమున నీకు అసామాన్య వినోదములనుజూపెదను. వానిని జూచినప్పుడు నీవు నన్నభినందించెదవు. నేనొక దీప మును వెలుగ జేసెదను. అప్పుడు నీవు పరిసరమునజూచు

విడివిడి యెండుపుల్లలను బోగుచేసియుంచుము. వానితో నొకమంట వేయవచ్చును” అనిచెప్పెను. అలాఉద్దీను చుట్టు ప్రక్కలఁ బడియున్న పుల్లల నొకమోపెడేరెను. మాంత్రికు డొక వెలుగుజేసెను. ఆపుల్లలనన్నిటిని దగిల్చి మాంత్రికు డొక పెద్దమంటజేసి, దానిలో నొక పొడిచల్లెను. మంటలో నుండి పెద్దపొగ బయలుదేరెను. మంత్రజ్ఞుడు కొన్ని యక్షరముల నుచ్చారణ సేయుచు నాపొగను నలుదిక్కులకు వ్యాపించునట్లు చేయి యాడించెను. అతడుచ్చరించిన మాంత్రిక శబ్దముల యర్థము అలాఉద్దీనుకు బోధపడలేదు.

ఆసమయమున భూమికంపించి, యామాంత్రికుని మోలనడ్డముగా పడియున్న యొకపెద్దరాయి కనబడెను. దాని నడుమ నొక యిత్తడి యుంగరము బిగింపబడియున్నది. ఈరాయి తొలుత నొక పెద్ద గుహ ముఖమునకు ద్వారముగానుండి దానిని మూసియున్నది. ఆగుహ ముఖద్వార మప్పుడు దానిచేమూయబడినది. అలాఉద్దీను అదృశ్యమునుజూచి చాల భయపడెను. అచ్చటనుండి తప్పికొని పాఱిపోవుటకు బ్రయత్నించెను. కాని మాంత్రికుడు వానిని దిట్టి గట్టిగా పట్టుకొని చెవిమీద నొక గుద్దుగుద్దెను. అలాఉద్దీను నేలపైబడెను. భయకంపితుడైన అలాఉద్దీను వెంటనేలేచి యొడలుదులుపుకొని చిన్ననాయనా; నాయెడల నింత తీవ్రముగా, గఠినముగా బ్రవర్తించుటకు నేనేమి తప్పుచేసితినని ప్రశ్నించెను. మాంత్రికుడు యిట్టిచర్యకు దగిన కారు

ణము లేకపోలేదు. నేను నీపినతండ్రిని. నీతండ్రిస్థానమున నిన్ను నేను నిలువబెట్టవలసి యున్నాను. నీవు మాఱుమా టాడరాదు అని బెదరించి చెప్పెను. మఱియు మృదుమధుర వాక్యములతో బాబూ భయపడకుము. నీనుండి నేనేమియు గోరదలచియుండలేదు. నేనునీకు చెప్పినప్రకారము చేయు చుండుము. దాని ఫలితమును లాభమును నీవే యనుభవింప వలయునని నా అభిప్రాయము. ఈమాటలతో అలాఉద్దీను భయముతగ్గెను. కోపము శాంతించెను. ఆసంగతి గ్రహించి మాంత్రికుడు నాయనా! నాధూపద్రవ్యము ప్రభావమువల్ల ను, నామంత్రాక్షర ప్రభావమువల్లను నేనేమి చేయగలిగితినో చూడుము. ఈ రాతిక్రింద నపారమైన ధనరాశియున్నది. దానివలన నీవు ప్రపంచములోని రాజాధిరాజులలో నుత్తమో త్తమ ధనికుడవగుదువు. ఈరాతి నెత్తుటకుగాని, ఈగుహ లో ప్రవేశించుటకుగాని, నీకుదప్ప మఱియొకరికి అనుజ్ఞ లేదు. కావున నేను నీకు ఆదేశించిన ప్రతియంశమును శ్రద్ధతో జేయుచుండుము. ఈ చర్యాఫలితము మనఉభయు లకును లాభకారి కాగలదు."అనియు తెలియపఱచెను.

అలాఉద్దీను ఆదృశ్యమునుజూచి మిగుల నాశ్చర్య పడజొచ్చెను. మాంత్రికుడు పేర్కొనిన ధనమునుగూర్చి విని తనజీవిత మింక సౌఖ్యమయము కాగలదని నమ్మి గత విషయమునంతను మఱచెను. "చిన్ననాయనా! నీవు చెప్పినదెల్ల శిరసావహించి చేసెదను. ఏమిచేయుమందువో

చెప్పు"మనెను. "కుమారా! నామనస్సు చాల సంతోషపడి న"దని వానిని గౌగిలించుకొని "ఈయుంగరము పట్టుకొని యీరాతిని లేవనెత్తి ప్రక్కగా నుంచుమని మాంత్రికుడు శాసించెను. అంత నాబాలుడు ఆరాతి నెత్తుటకు దనకు బలము చాలదనియు అతడు తనకు సహాయము చేయవల యుననియు జెప్పెను. అంత నతడు "బాలకా నా సహాయ ముతో నవసరములేదు. దీని యుంగరమును పుచ్చుకొని, నీతండ్రియొక్క నామముల నుచ్చరించుచు, వారిని మన సార ధ్యానముసేయుచు నీరాతినెత్తుము. అయ్యది సులభ ముగా లేచును" అని యుపదేశించెను. వెంటనే అలాఉద్దీను తలిదండ్రులను ధ్యానించుచు నారాతిని సులభముగా నెత్తి యొక్కప్రక్కకు బెట్టెను.

రాయితీసి ప్రక్కకుబెట్టినంతనే బాలునకొక నాలు గడుగుల లోతుగల గుహ గానవచ్చెను. దానిలో నొకచిన్న ద్వారమును ఇంకను గ్రిందికి బోవుటకు దగినమెట్లును గనబడెను. ఒడ్డుననున్న ఆఫ్రికా మాంత్రికుడు "నాప్రియ కుమారా! నేను చెప్పినట్లుచేయుము. గుహలోనికిదిగుము క్రిందిమెట్టువద్ద నిల్చి చూచితివేని తెరవబడియుండు ద్వార మొకటి యగపడును. ఆద్వారములోనుండి పోయినచో మూడు పెద్దభాగములుగా విభజింపబడిన యొకవిశాలమైన కట్టడము కనబడును. ప్రతియొక అరలోను నాలుగునాలుగు యిత్తడితొట్టెలు కనబడును. అవి వెండిబంగారములతో

నిండియుండును. వానిని నీవు ముట్టరాదు. నీవాయరలలో నడుచునపుడు నీవస్త్రములు జీరాడనీయక గట్టిగాచుట్టి పట్టు కొనుము. అందలి గోడలను నీవు ముట్టరాదు. మొదటి యరను దాటగనే రెండవఅరలో నీవు క్షణమైనను నిలువక సరాసరి మూడవ మందిరములోనికి బొమ్ము ఎచ్చటనైనను నీవు గోడలనంటితివేని నీకు మరణముతప్పదు. మూడవ మందిరము చివర నొకద్వారము గలదు. దానిలోనుండి నొక చక్కని ఫల వృక్షముల తోటలోనికి బోవుదువు. ఆ తోటలోని కాలిత్రోవను బట్టుకొని ముందుకుసాగిపోయినచో అయిదుమెట్లుండును. ఆమెట్లు నిన్నొక మిద్దెమీదికి దీసి కొనిపోవును. ఆమిద్దెలోగల ఒక గూటిలో నొక దీపము వెలుగుచుండును. ఆదీపపు పళ్ళెరమును చేతితో దీసికొని వెలుగునార్పుము. ఆయఖండములోని వత్తిని చమురును నందే పారవైచుము. వత్తియు చమురును అదృశ్యమైన ప్పుడా యఖండము ఎండుగానుండును. దానిని నీవస్త్రులలో నిమిడ్చుకొనుము. నీవిచ్ఛగించినచో. నాతోటలోని ఫలము లను నీవు పుష్కలముగా గోసికొనవచ్చును." అని పలికి తన చేతి వ్రేలునగల యొక యుంగరము నలాఉద్దీను వ్రే లికిబెట్టి "ఈయుంగరము నీవు నేను చెప్పినయట్ల చేయు నప్పుడిది అంగరక్షగా నుండగలదని చెప్పెను. ఇట్లుపదే శించి మాంత్రికుడు "కుమారా! ధైర్యముతోబొమ్ము, దీని వలన మనఉభయులజీవితములు భాగ్యవంతములు గాగలవు.

అలాఉద్దీను గుహలోని కురికి, మూడుమెట్లు క్రిం దికిదిగి చూడగాఁ గనబడిన ద్వారములోనుండిచూచి మూడు



భవనభాగములు గనుగొనెను. సూటిగా మాంత్రికుడు చెప్పినప్రికారము గూటిలో అఖండము వద్దకుబోయి దానిని దీసికొని, వత్తిని చమురును బారవైచి తన దుస్తులలో బెట్టుకొనెను. తిరిగి వచ్చునప్పుడు అందున్న తోటలోని పలురంగుల ఫలములను గోసికొనెను. అవి ఫలములవలె వృక్షశాఖల వ్రేలాడుచుండెను గాని యవియన్నియు అమూల్యరత్నములు తెల్లనివి పుష్యరాగములు, పచ్చనివి గారుడ మాణిక్యములు నల్లనివి నీలములు. ఇట్లు వజ్రివైడూర్య మరకత మాణిక్యాదులను నాశకొలది రెండుగంపలు గోసికొని, తనజేబులనిండ దుస్తులనిండ నింపుకొని గుహాముఖమునకు వచ్చెను. రానురాను వెనుకటి ద్వారములు మూయబడుచుండెను. చివరి గోతిలోనుండి యారత్నముల బరువుతో పైకెక్కనేరక, "పినతండ్రిని బిలిచి పైకెక్కుటకు

జేయూత యిమ్మనెను. మాంత్రికుడు తొలుత నా యఖం డమును నిటుదెమ్మనెను. నన్ను ముందు పైకెక్కించుమని అలాఉద్దీను పల్కెను. ఉభయులు నిట్లు పట్టుదలతో సంభా షించుకొనుచుండిరి. అంతలో నిఁక ఈబాలునితో నేమియు బ్రియోజనము లేదనియు, ఆలసించినచో పరిసర ప్రాంత మున బయనించు పాంథులు గనుగొన్నచో సర్వహానియని యు దలంచి, తొలుతటివలె మంటలేసే పొడిచల్లి మంత్రో చ్చారణ సేసెను. ఆరాయి తిరిగి గుహాముఖమును గప్పు నట్లువచ్చిపడి, పైనున్న మంటికప్పుతోకూడ నందమరి యుండెను. అలాఉద్దీను రాతికింద చిన్నగుహలో నిరుకుబడి యుండెను.

ఈ ఆఫ్రికామాంత్రికుడు తన పినతండ్రిగాడనియు కేవలము తనను మోసగించుటకు వచ్చిన వాడనియు అలా ఉద్దీను గ్రహించెను. ఈమాంత్రికుడు ఆఫ్రికాదేశములో నలుబది సంవత్సరములు మాంత్రిక వ్యాపారములో దిరిగి చైనాదేశములోని యాభాగముననున్న గుహలో నిట్టివిచిత్రా ఖండ దీపము గలదని తెలిసికొని దానిని సాధించు కొనుటకై వచ్చెను. దానినతడు మఱియొక చేతిమీదుగా గ్రహించవలయునుగాని స్వయముగా దెచ్చుకొనుటకు నవ కాశములేదని, యతడు మున్నెయెఱింగెను. అందువలననే బీదయింటి బాలుడగు నలాఉద్దీనును బట్టుకొని యుపయో గించుకొన యత్నించెను. అఖండమును సాధించి, తిరిగి

అలాఉద్దీను నేదోనెపమున నాగుహలోనికంపి రాతిక్రింద తన మాంత్రికశక్తితో బూడ్చివేయుటయే యతని యాశయమైయుండెను. కాని యతని అభిలాషయిఁక నెరవేరజాలదని గ్రహించిన వెంటనే రాతిని యథాస్థానమున స్థాపించి, ఎవరికంటను బడకుండ సరాసరి ఆఫ్రికాదేశమునకు వెడలిపోయెను. చేయునదిలేక మహాసామర్థ్యముగలతనచేతివ్రేలి యుంగరమునుగూడ అలాఉద్దీనువ్రేలున నున్నదాని నున్నయట్లే విడచిపోయెను. ఈ మహారహస్య కార్యక్రమము గాని తానొక పిల్లవానిని దీసికొనివచ్చి యిట్లు చేసినవిషయముగాని, అతడాఫ్రికా దేశమునుండి వచ్చిన మాంత్రికుడను విషయముగాని యేమాత్రము బయలుపడగూడదను దృఢాభిప్రాయమే అతని హఠాత్ప్రయాణమునకు గారణము. అఖండదీపముతోబాటు వ్రేలి ఉంగరముగూడ అన్యాక్రాంతమై నష్టమైనదను విచారముగూడ నతనిజీవితాశకు నష్టము సేయలేదు. అతనిమనోధైర్య మతని వెంటనంటి పయనించెను.

కనబడుచున్న పరిస్థితినిబట్టి చూడ నలాఉద్దీనుకిక జీవితాశ లేకుండెను. బ్రతికియుండి భూగర్భనివాసశిక్ష ననుభవించుచున్న అలాఉద్దీను పశ్చాత్తాపమునకు మేరలేకుండెను ఎట్లో బయటపడిన చాలునని "పినతండ్రీ ! నీ అఖండము నీకిచ్చివేయుదును నన్నుబయటవేయుమని పలుసార్లు కేకలువైచెను. కాని వాటి నాలించుట కచ్చట నెవ్వరును లేరైరి.

ఇఁక బరమాత్ముఁడే యిట్టిసమయమున శరణ్యుఁడని యాతని ప్రార్థించుచు రెండుచేతులు గట్టిగా నులుముకొని పైకెత్తెను. అతని వ్రేలనున్నయుంగరమున కొంరపిడితాకిన క్షణముననే ఒక యసాధారణ పరిమాణముగల రాక్షసుడు అతనిమ్రోల నిలువబడి; "అయ్యా నీకేమిఁకావలయును. ఈ యుంగరమును ధరించిన నీకును, ఈ యుంగరము ధరించు నితరులెవ్వరైనను వారికిని నేను సేవకుడను. నేనేగాక నీసేవ సేయుటకు నాయొద్ద నింక నెందఱో సేవకులున్నారని పల్కెను. అలాఉద్దీను మహాధైర్యముతో అయ్యా! నేను రెండుదినములనుండి యన్నపానీయములులేక ఈ భూగర్భమున గృశించుచున్నాను. నీవెవ్వరివైనను, నాకు దోడ్పడదలంచితివేని, నన్ను గుహాముఖమునుండి వెలువరించి భూమిపై నుండునట్లు చేయుమని వేడెను. క్షణకాలమున నా రాక్షసు డాతనిని దొలుత మాంత్రికుడు మంత్రాక్షరములు పాడిన తావున భూమిపై నిలువబెట్టెను. చీకటిగుహాలోబడి చీకటినే జూడ నభ్యసించిన యాతనికనుదోయి కొంతతడవు వెలుతురునే జూడలేక పోయెను. కొంతతడవునకు భూమిని జూడగలిగి తొలుత దాటివచ్చిన తోటలోనుండి కాలిత్రోవ నవలంభించి, క్రమక్రమముగ దీవ్రగమనమున నిల్లుసేరి తల్లిపాదములపై బడెను. మూడుదినములనుండి యన్నపానములు లేక కృశించిన యతనిని దిరిగి క్రమక్రమముగ కొంచెము కొంచెమధికముగ దినిపించుచు, నాభాగ్యవతి

కుమారుని నారోగ్యవంతుని జేయగలిగెను. శరీరారోగ్యము గలిగినవెంటనే అలాఉద్దీను తనతల్లి కామాంత్రికుని కుతంత్రము నంతయు వినిపించెను. వినివిని, విసిగి యాతల్లి దుష్టమాంత్రికుని సర్వవిధముల దూషించెను. అలాఉద్దీను దెచ్చిన మాణిక్యఫలముల విలువ వారుభయులకు దెలియకుండుటచే వాటినొక సోఫాచాటున బడవైచియుంచెను. ఆ రాత్రి యంతయు అలాఉద్దీను సుఖముగా నిద్రించెను.

మఱునాడు తూర్పురేకలు వారు సమయమునకే అలాఉద్దీనుకు ఆకలిబాధ ప్రారంభమయ్యెను. తల్లినిబిల్చి యేదేని తినుట కొసంగి నీరుద్రావించుమని యడిగెను. పాప మాబీదరాలి యింట నప్పటి కేపదార్థమును లేకుండుటచే, వడికిన దూది నమ్మికొంతసొమ్ము దీసికొని తిను పదార్థములు గొనివచ్చెదను కొంచెముసైచుమని చెప్పి పయనమయ్యెను.



అప్పు డమ్మా! వడికిన దూదినటుండనిమ్ము. నిన్న నేను గైకొనివచ్చిన యఖండపాత్రమునిటుదెమ్ము దీనినమ్మి సొమ్ము చేసి, నేనే బజారునుండి యాహారపదార్థములను

గొనివచ్చెదనని పల్కెను. ఆమాటవిని సంతసించి "నాయనా! ఆలఖండము చాల చిలుముబట్టియున్నది. అట్లుండిన నెవ్వరును స్వీకరింపరు. దానిని శుభ్రముసేసి యిచ్చెద నిటు దెమ్మని తనచేతికిదీసికొనెను. దానిని తనయింటి వెనుకకు దీసికొనిపోయి కొంచెము నీరు దానిపైఁబోసి ప్రక్కనున్న యిసుకతో దానిపై రుద్దనారంభించెను. అంతలో అసామాన్య పరిమాణముగల యొక భయంకర రాక్షసుడు ఆమె మ్రోల నిలువబడి స్తనితనిధ్వానముతో "నీకేమి కావలయును? ఈదీపపు ప్రమిదను స్వాధీనములో నుంచుకొనువారికి నేనును, నాతోఁబాటు మఱికొందరును సేవకులము. త్వరగా చెప్పుము నీయాజ్ఞ నెఱవేర్తుమని యెల్గెత్తిపల్కెను. ఈదృశ్యమును జూడజాలక ఆమె మిన్నకుండెను. అంతలో నా నినాద మాలకించి వచ్చిన అలాఉద్దీను తన తల్లిచేతిలోని దీపపు ప్రమిదను దనచేతికి దీసికొని తొలుతనొకసారి యిట్టిరాక్షసుని జూచియున్న వాడగుటచే ధైర్యసాహసవృత్తి నవలంభించి "మాకాకలియగుచున్నది, తినుపదార్థములను దీసికొనిరమ్మ"ని రాక్షసున కాజ్ఞయొసంగెను. అలాఉద్దీనుతల్లి మూర్ఛజెంది నేలకుఁ గొరిగెను. రాక్షసుడు ఒక నిమిషమాత్రి కాలమున నొక పెద్ద వెండితొట్టెలో కొన్ని వెండిగిన్నెలు పెట్టి వాటినిండ ఆహారపదార్థములను, పండ్లను, సువాసనగల బ్రాండి ద్రావకమును మఱియు నెన్నియో రుచికరములైన పదార్థములను దెచ్చి యచ్చటనున్న యొక

తివాచిపై బెట్టి యదృశ్యుడయ్యెను. అలాఉద్దీను కొంచెము నీరుదీసికొని ఆమెముఖమున జల్లి సేదదీర్చెను. జలకణ స్వభావమువల్లనో లేక రాక్షసానీతమగు మాంసాహారము యొక్క సువాసన వల్లనో, యామె అతిశీఘ్రకాలమున, శ్రమముబాసి, లేచి కూర్చుండి తెలివితో మాట్లాడసాగెను.

భోజనానంతరమున దల్లికొడుకు లిరువురు సోఫాపై గూర్చుండిరి. ఆసమయమున సత్యాతృతతో తల్లి నాయనా రాక్షసు డగపడినప్పుడు నేను భీతిచే మూర్ఛిల్లి యొడలెరుంగని దాననైతిని. మీ యుభయులకు నేమి సంభాషణముజరిగెనని కుమారుని ప్రశ్నించెను. అలాఉద్దీను రాక్షసునకు దానుచేసినయాజ్ఞారీతిని జెప్పి పదంపడి యారాక్షసు డందులకు సమ్మతించి యాభోజన పదార్థముల నన్నింటిని దెచ్చిపెట్టిన విధానమును జెప్పెను. తల్లి



మిక్కిలి యాశ్చర్యపడి, కుమారా! ఈరాక్షసునితో మన కేమిపని ? మా పూర్వ పరిచితులలో నెవ్వరును నిట్టి రాక్ష

సుని కనివిని యెఱుంగరు. నీకొకసారి దృగ్గోచరుడై నిన్ను గుహలోనుండి పైకిదెచ్చి విడిచిన రాక్షసుడు తిరిగి నీకే కనుపించక నాకేల కనబడవలయును." అని ప్రశ్నించెను. అలాఉద్దీను దల్లి మాటలలోని యవిజ్ఞానమును గ్రహించి "అమ్మా నాకు మున్ను దృశ్యుడైన రాక్షసుడొకడు. ఈ పర్యాయము నీకుగానవచ్చిన రాక్షసుడు మఱియొకడు. నా కగపడిన రాక్షసుడు నేను ధరించిన యుంగరమెవ్వరి దగ్గర నున్నను వారికే సేవకుడు వారియాజ్ఞనే శిరసావహించును. ఈరాక్షసుడు నీవు ఒరిపిడిచేసిన యీ దీపపుప్రమిదెయెవ్వరి యొద్దనుండునో వారికే సేవకుడు. అతడు వారియాజ్ఞలనుపూ ర్తిమేనెఱవేర్చును. అతనిఅలవాటులు వేఱు. ఇతని అలవా టులువేఱు. వారియజమానులు వేఱువేఱుగానున్నారు. బహుశః నీవు అతనగపడినప్పుడు, మూర్ఛబోయి యుండుటచే వాని మాటలనునీవు వినియుండవు."అని ప్రత్యుత్తరము చెప్పెను. అంతతల్లి యించుకరోషము తెచ్చుకొని "యేమనుచున్నావు అతడు నీదీపపు ప్రమిదెకు సంబంధించినవాడా ? అట్లయిన నాకేల నగపడవలయును ? ఆ దీపికాపాత్రను నాకగపడ నీయకుము నీయిచ్చవచ్చినచోట దాచిపెట్టుకొనుము. నేను దాని నెన్నటికిని స్పృశింపజాలను. నీవు తిరిగి దానిని స్పృ శించి, కర్షించి యపాయకరమైన దృశ్యముచే కంపితుడ వగుటకంటె, శీఘ్రముగా బజారునకు దీసికొనిపోయి విక్రయించి వేయుటయే శ్రేయస్కరము. అంతియగాక నీవు

నాసలహా నంగీకరింతువేని నీవేళ్ళనున్న యీ యుంగర మునుగూడ నెవ్వరికైన నమ్మి వేయుటయే యుత్తమకార్యము. దానితో మనకు రాక్షస సంబంధము వదలిపోవును. తొలుత మన దేవదూత చెప్పినప్రకారము, ఆరాక్షసులు సర్వానిష్టకరములైన దయ్యములుగాని మఱివేఱుకారు." అని ప్రసంగించెను.

అంత నజాఉద్దీను, తల్లీ ఈపదార్థములను అమ్మి వేయుటలో సూక్ష్మముగ నాలోచింపవలసియున్నది. ఈ దీపికా పాత్రము నాకొక్కనికేగాక నీకును నుపయోగకరమైనది. ఈ ప్రయోజనమును నీవు కన్నులార జూచితివి. ఇంటిలో నాహారపదార్థములు లేని సమయమున, అమోఘ రుచికరమైన ఆహారపదార్థములను బుష్కలముగా దెచ్చి పెట్టినవాడుగదా ! పినతండ్రినిచెప్పుకొని నన్ను మోసగించిన యా టక్కరి మాంత్రికుడు ఈదీపికా పాత్రముకొఱకు, ఎన్ని కష్టములుపడి ఎంతదూరము ప్రయాణముచేసెనో వినియుంటివిగదా ! అతడు ఈదీపికా పాత్రముకొరకు వెండి బంగారములతో నిండియుండిన పెద్దపెద్ద భోషాణములను లెక్కసేయలేదు. ఆధనమును సర్వస్వమును గుహలో నా కన్నులార జూచి వచ్చితిని. దాని ప్రయోజనము అదృష్టవశమున మనకు వెల్లడి అయినది. కావున దానివలన కానగు లాభములను మనము ప్రయోగపఱచు కొనవలయునని నావిశ్వాసము. దీనివలన యుపయోగమును మన యిరుగు పొరుగు

వారికివెల్లడించి వారికి మనయందు ఈర్ష్యాభావము గలుగునట్లు సేయరాదు. ఐనను ఆరాక్షసదృశ్యము నిన్నొకసారి భీతిలజేసినది. గనుక అయ్యది నీకంట బడకుండ నుండునట్లు దానిని నేనొక మూల దాచి కాపాడెదను. అది యెట్లున్నను ఈ వ్రేలియుంగరమును మాత్రము నేను త్యజింపజాలను. ఆయుంగరమే నాకు లభింపనిపక్షమున నీవు నన్ను తిరిగి చూశగలిగి యుండుదానవుకావు నేను నిన్నుగ్రమ్మర దర్శింపగలిగియుండువాడను గాను. నేనిప్పుడు జీవించియున్నను ఆయుంగరము నాయొద్ద లేనిపక్షమున, మఱికొన్ని నిమిషములలో నేనట్లు సజీవుడనై నీకు నగపడక పోవచ్చును. కావున నేనాయుంగరమును మాత్రము విడువజాలను.” అని వాదించెను. అలాఉద్దీను వాదములు సక్రమముగానున్నందున నతనికి వ్యతిరేకముగా నేమియు జెప్పజాలకపోయెను. తుట్టతుదకు “నీయిష్టానుసారముచేసికొనుము నేనుమాత్రము మాపెనుభూతములతో నెట్టి సంబంధమును పెట్టుకొనజాలను. వాటినిగుఱించి యింకముందు నేనేమియు బ్రసంగింపను” అని యాభాగ్యవతి మిన్నకుండెను.

మఱుదినము రాత్రియందును, తొలుత మిగిలియున్న ఆహారపదార్థములను దల్లికొడుకు లిరువురును, బుష్కలముగా సంతోషముతో భుజించిరి. అంతటితో రాక్షసుడు తెచ్చినవెల్ల ముగియుటచే మఱునాటి యుదయమున భుజించుటకేమియులేవయ్యెను. అలాఉద్దీను ఆకలిబాధను సహింప

లేకుండెను. వెంటనే అతడు మొదలుగరాక్షసుడు తెచ్చిన పండ్రెండు వెండిగిన్నెలలో నొకదానిని తనలోపలి చొక్కా జేబులో నుంచుకొని కడువేగముగా బజారునకు బోవుచుండెను. బజారులో నొకప్రక్క అలాఉద్దీనునకు నొకయూదుడు కనబడెను. ఆయూదుని సమీపించి అయ్యా నాయొద్ద నొక వెండిగిన్నె యున్నది. దీనిని నీవు కొనియెదవాయని ప్రశ్నించెను. "మంచిది ఆగిన్నెను జూపుమని యూదుడడిగెను. అంత అలాఉద్దీను తన చొక్కాజేబులోనుండి, వెండిగిన్నెను దీసి యతనికి జూపించెను. యూదుడీగిన్నె నెంతకిచ్చెదవనెను. "అంతయింతయని యేమి? మీరు వ్యాపారస్థులు. ఈ పదార్థ మెంతచేయునో మీకు తెలియును. కావున న్యాయప్రకారము ఎంతచేయునని మీరుచెప్పెదరో అంత మొత్తమును మాత్రమే స్వీకరించి యీపాత్రను మీకు స్వాధీనము సేయగలనని అలాఉద్దీను బల్కెను. మిగుల టక్కరియని పేరుబడిన యాయూదుడు, తనజేబులోనుండి యొక బంగారునాణెమునుదీసి "బాలుడా! ఈ వెండిగిన్నె వెలక్రింద దీనిని దీసికొమ్మని యాతని చేతికిచ్చెను. యూదుడా వెండిగిన్నెను దీకొనియెను. అలాఉద్దీను ఆయొక్క నాణెమునకే యెంతయు సంతసించి, ఆ నాణెమును బాజారుకు దీసికొనిపోయి వచ్చినన్ని యాహారపదార్థములు దీసికొని యానాడు తనివితీర భుజించెను. తిరిగి మరుసటియుదయమునకు భోజనసామగ్రిలేదని తల్లి హెచ్చరించెను.

అలాఉద్దీను తిరిగి మఱియొక వెండిగిన్నెను దీసికొనిపోయి యాయూదునకే అదేవెలకు విక్రయించి భోజనపదార్థములు తీసికొనివచ్చెను. ఆనాడు గడచెను. ఇట్లురాక్షసుడు తెచ్చి పెట్టిన పండ్రెండు వెండిగిన్నెలను దినమున కొకటిచొప్పున విక్రయించి క్రయధనముతో అలాఉద్దీను పండ్రెండు దినములు గడపెను. పదుమూడవనాడు తిరిగి ఆహారపదార్థము తెచ్చుట కవసరమయ్యెను. ఇంటిలో రాక్షసుడుతెచ్చిపెట్టిన పెద్ద వెండితట్టమాత్ర ముండెను. అదికూడ ఆయూదునకే పది నాణెములకమ్మి ఆ పదినాణెములతో పదిదినములవఱకు సరిపోవు తినుపదార్థములను కొనితెచ్చి పదిదినములవఱకు నిర్విచారముగా భుజింపగల్గెను. తొలుతటివలెగాక అలాఉద్దీను యిప్పుడు గృహకృత్య నిర్వహణమునందు కొంత శ్రద్ధతీసుకొనెను. ఆఫ్రికన్ మాంత్రికునితోటి పరిచయమైన దాదిగా అతడు చిన్నపిల్లలతోను సోమరి పోతులతోను ఆటలాడుకొనుట తగ్గించెను. గొప్ప మర్యాదగల వర్తకుల యంగడుల యొద్ద నప్పుడప్పుడు కొంతతడవు నిలిచి గౌరవనీయుల సంభాషణలు వినుచు గాలక్రమమున గొంత ప్రపంచక జ్ఞానమును సంపాదించెను.

అలాఉద్దీను యొద్దనున్న ద్రవ్యమంతయు దరిగిపోయెను. ఇంటిలోఁ దినుపదార్థములులేవు. దీపపుప్రమిదె నొరపించి రాక్షసుని సహాయము పొందుట తప్ప అతనికి వేఱొక మార్గము కనబడలేదు. ఆదీపికాపాత్రముపై తొలుత

తనతల్లి యొరపిడిచేసిన భాగమునుగుర్తుంచుకొని, తానును మఱియొకసారి యొరసెను. నిమేషమాత్రమున రాక్షసు డాజానుబాహు స్వరూపమున బ్రత్యక్షమై "అయ్యా! నీకేమి కావలయును. నేనును నాతోపాటు మఱికొందఱును ఈ ప్రమిదె స్వాధీనములో నుంచుకొనువారి కందరికిని సేవకులము. నీయాజ్ఞ నెరవేర్తును చెప్పు"మనెను. అలాఉద్దీను, నాకాకలియగుచున్నది దినుటకేమైనఁ దెచ్చియిమ్మనెను. రాక్షసు డదృశ్యుడై పోయి తత్‌క్షణమే తిరిగి కనఁబడి, ఒక వెండితొట్టెను దానిలో తొలుతటివలె పండ్రెండు వెండిగిన్నెలును వాటినిండ బట్టినంత యాహారపదార్థములును మదిరా పానీయముగల రెండు పాత్రలను దెచ్చి నెమ్మోలఁ బెట్టెను. ఆయాహారములను దల్లికొడుకులు మూడురోజులవరకు కడుపునిండార ననుభవించిరి. పదంపడి దినమున నాహారపదార్థములు లేనందున దిరిగి యొక వెండిగిన్నెను గైకొని, అలాఉద్దీను బజారులోని పూర్వపు యూదునియొద్దకు బోవుచు యథాప్రకార మాగిన్నెలనమ్ముచు ఆయమ్మకపు ద్రవ్యముతో చాలవరకు దారిద్రము తీఱినది. వెండి బంగారపు జరీబట్టల వర్తకులతోను, పట్టు, ఉన్నిబట్టలవర్తకులతోను అధికముగా గలసిమెలసి సంచరించుచు అధిక ప్రపంచ జ్ఞానమును సంపాదించెను. పెద్దవర్తకుల సంభాషణములతో, నతనియొద్ద పూర్వము గుహోపవనమునుండి తెచ్చినవి రంగుల గ్లాసుఉండలుగావనియు పెద్ద విలువగల

రత్నములనియు గ్రహించి వాని విషయ మెవ్వరికినిజెప్పక రహస్యముగా జాగ్రత్తపరచుకొనెను. అతని తల్లికినైన నవి గొప్పవిలువగల పలురంగుల రత్నములని తెలియ నీయలేదు.

ఒక దినమున, అలాఉద్దీను బజారునకుబోయెను. ఆసమయమున నానగరాధీశుడగు సుల్తానుకుమార్తె బుద్దీరుల్ బుద్దీర్ అను కన్యక దినదినమును స్నానార్థమై భవనానంతరమునకు బోయివచ్చుచుండెను. నగరవాసులెల్లరు నప్పుడు తమ గృహముల ద్వారముల తలుపులు మూసి యుండవలయుననియు జనులెవ్వరును వీధిలో దిరుగాడ గూడదనియు రాజాజ్ఞ సేయబడియుండెను.



అలాఉద్దీనుకు ఈమె సౌందర్యమును జూడ వలెనని సంకల్పము గల్గెను. అతడప్పుడు అధిక సాహసము బూని ఆమె జలకమాడు గది తలుపునకు వెనుకప్రక్కనున్న యొక భవన భాగములోజేరెను. రాజ కన్యక స్నానపుగదిలో జేరి మేలిముసుంగుతీసి దూరముగా నుంచెను.

అలాఉద్దీను తానెవ్వరికిని నగపడకుండ నక్కి గదితలుపు సందులోనుంచి యామె చక్కదనమును గన్నుల కరవుదీర జూడగగ్గెను. మనోహర సౌందర్యము సహజముగా నుత్పత్తిసేయుభావములు అలాఉద్దీను చిత్తమున నంకురింపసాగెను. ఆమె సుందరస్వరూప మాతని హృదయమున నాటుకొని యతనిని మోహపార వశ్యము పాలుసేసెను. రాజకన్యక తన సౌధమునకుఁ దిగిపోయి నంతవఱకు నలాఉద్దీను ఆమెనుజూచి మెల్లగ మోహజాడ్య పీడితుడై తప్పటడుగులు వైచుకొనుచు నిజనివాసము జేరెను. అతనిహృదయమున బుద్దీరుల్ బుద్దూరు సుందర ప్రతిబింబము నాటుకొని పెరభావములు నొరనీయక మందునిజేసెను. ఇంటియొద్ద తన మామూలు సోఫాపై చతికిలబడి వెలపల క్రిందికి మీదికి జూచుచు విచారముతో గూర్చుండెను.

తల్లి యాతని ముఖలక్షములో నేటికో మార్పు కలిగినదని గ్రహించెను. రాత్రివేళ భోజనమునకు రమ్మని ముమ్మారు పిల్చినను చుఱుకుగాలేచి రాకపోయెను. తుదకెట్లో భుజింపవచ్చి మామూలుగా దినునాహారమునకంటె చాల తక్కువగా భుజించెను. ఈ అవస్థకు గలుగు కారణము గ్రహించుటకై తల్లి యెన్ని ప్రశ్నలువేసినను తలయూపులును, క్రిందిచూపులును, సగమువాక్యములేగాని సరియైన ప్రత్యుత్తరములు లేవయ్యెను. రాత్రి పొద్దుపోయిన వెనుక నిశ్శబ్దముగా, దలవంచుకొని సెజ్జపై మేనువాల్చి

నిదురించెను. కుమారునకేదో అనారోగ్య మాంద్యము జనించినదని నిశ్చయించుకొని యతనిని పెక్కుసార్లు ప్రశ్నించుటమాని తల్లియు సెజ్జజేరి యారాత్రియు గడపెను.

మఱునాటియుదయమున దల్లి దూదివడకు తావున కెదురుగా నున్న సోఫాపై అలాఉద్దీను కూర్చుండియుండెను. "నాయనా! నీవెప్పటివలె జురుకుగా లేకుండుటకు గారణమేమని" తల్లి యడిగెను. అతడు కడచిన దినమున సుల్తానుపుత్రిక స్నానార్థమై స్నానపుగదికి బోవుటయు, తానామెను సందర్శించుటయు, ఆమె సౌందర్యము తన మనోబాధకు గారణమగుటయును విశదముగాజెప్పి, ఆమెను బెండ్లాడు మనోనిశ్చయమును వెలిపుచ్చి రేపటి దినమున దాను స్వయముగా సుల్తానును సందర్శించి ఆయన కుమార్తెను దనకిమ్మని యడిగెదనని నిర్భయముగా జెప్పెను. ఈమాటలు వినినవెంటనే అతని తల్లి పెద్దగానవ్వెను. నీకేమైన పిచ్చియెత్తినదా యనియు నడిగెను. అంత నతడమ్మా నాకేమియు పిచ్చిలేదు. నామతియు చెడిపోలేదు. నీవేమైనను దలంపవచ్చును. గాని నేను సరియైన స్థితిలో నున్నాను. నీవెంతతిట్టినను నేను సుల్తానును సమీపించి నీ కుమార్తెను నాకిమ్మని అడుగక మానననెను. "సరే! కాని యిట్టి కార్యములపట్ల రాయబారుల నంపవలయును. నీసందేశము నచ్చటికి దీసికొనిపోవ సాహసించువా రెవ్వ"రని తల్లియడిగెను. "నీవే స్వయముగా బోవలయు"నని యత

డనెను. ఆమాటలువిని తల్లి; "ఓయీ, తెలివిమాలినవాడా! రాజులు తనవంటి రాజకుటుంబము వారికిగాని పడుచుల నియ్య నియ్యకొనరు. నీపూర్వస్థితి నీవు మఱచి మాట్లాడు చున్నావు. నీవొక కుట్టుపనివాని కుమారుడవు. నీవేపూట కాపూట తినుబండారము కొఱకు వెదకుకొను నిరుపేదవు. రాజకుమార్తెతో నీకు సంబంధ మెట్లు సిద్ధించునని గట్టిగా యీసడించి పల్కెను.

"తల్లీ, నీదూషణము నామనోనిశ్చయమును మఱల్ప వేరదని యిదివరకే చెప్పితిని. నీవీరాయబారము నడుప సిద్ధ వడవేని, నాసమాధిని త్వరలో చూచెద"వని కుమారుడు బెదరించెను. ఈ ప్రసంగ మా మాతకు గర్ణకఠోరముగా నుండెను. ఈయసామాన్యమైన యభిలాష నతని హృదయ మునుండి తొలగించవలెనని యెంతయో బోధించెను. కాని యతడు తన పట్టినపట్టును వదలలేదు. ఇంకను వారుభయు లకు నీ సంభాషణజరిగెను.

తల్లి "కుమారా! ఈ సందేశము మన యిరుగు పొరుగునగల యేసాటివాని బిడ్డకొఱకైనను నేను సాధించి యుండెడిదానను అతడొక సుల్తాను. నీ ఐశ్వర్యమేమి? నీ జీవనోపాధి యేమియని అడిగినచో నేనేమిచెప్పవలయును?

అలాఉద్దీను "అంత రాజాధిరాజును మనము పడు చునడుగబోయి నప్పుడు భాగ్యభోగ్యములను గుఱించి యడుగవచ్చును. కన్యక కేమికానుకలని యడుగవచ్చును.

కాని నీకేమైన జీవనోపాధి గలదాయను చిన్నప్రశ్న నడుగ జాలడు. పెద్దవారిదృష్టి పెద్దప్రశ్నలమీదనే యుండును. ఒకవేళ నట్టిప్రశ్న నతడడిగినచో నేనొక వ్యాపారస్థుడనని నీవు చెప్పగలవు. దానిపైవచ్చు ప్రశ్నలనన్నింటికిని నేను స్వయముగ సమర్థములైన జవాబులు చెప్పగలను. వాటిని గుఱించి నీవు విచారింపకుము."

తల్లి "మంచిదికుమారా ? నావంటిబీదరాలికి సుల్తాను దర్శన మొసంగుటయే యరిది. తొలుత నాకు ప్రవేశమెట్లు కలుగును ? రాజదర్శనమునకు బోవువారియెడ రాజున కర్పింపనగు బహుమతి పదార్థము లుండవలయునుగదా ? అట్టివి నీయొద్ద నేమున్నవి.?"

అలాఉద్దీను "మంచివిషయము జ్ఞాపకముచేసితివి. నేను గుహోపవనమునుండి తీసికొనివచ్చిన రంగులగ్లాను ముద్దలు గ్లాసుముద్దలుకావు అవి పలురకముల మాణిక్య ములు వానివిలువ గొప్పది. అట్టివి సుల్తానువద్ద కూడ ఉండ జాలవు. వానిని నీవు కానుకగా గొంపోవచ్చును. ఇట్లొక యింత సంభాషించి వెంటనే సోఫావెనుక జాగ్రత్తచేయ బడిన రత్నములను చైనా పళ్ళెరములోనుంచి కానుకగా నర్పించుట కవి గొంపోయినచో, సుల్తాను కానుకగాగైకొని తనతోనేమైన సంభాషించుటకు అనుజ్ఞ ఈయవచ్చునని తల్లి యంగీకరించెను. కాని ఆమెమనస్సున తమవృత్తిస్వార్థ్య ములను గుఱించియు భోగభాగ్యములను గుఱించియు గలి

గిన సందేహము నివారణగానందున ఆవిషయమును గుఱిం చి క్రమ్మఱఁ ప్రశ్నించెను. అప్పుడలాఉద్దీను "అమ్మా! నీకేమి సంశయము. రహస్యవిషయముగనుక నేను మాటి మాటికి వ్యక్తపఱచి మాటాడుటలేదు. దీపికాపాత్ర మన కవసరమైన భవనాలకొఱకు సహాయము చేయగలదు. నీవు సంశయింపవలదని తల్లికి బదులుచెప్పెను. ఆమె మఱునాటి యుదయమున సుల్తాను సౌధమున కేగెదనని వాగ్దానము సేసెను. ఆరాత్రి వారనేక యితర విషయములను గుఱించి చర్చించి నెమ్మదిగా నిదురచెందిరి.

తూరుపు తెలవారుజాముననే నిదురమేల్కాంచి, ఆభాగ్యవతి స్నానాదికృత్యముల దీర్చుకొని ముఖ్యమంత్రి యొక్కయు నితరమంత్రులయొక్కయు ననుజ్ఞలు దీసికొని రాజభవనమునకరగి సుల్తానును దర్శింప బయలుదేరెను. ఆమెచేతిలో రంగురంగుల నవరత్నములతో నిండియున్న చైనాపళ్ళెరముండెను. ఆమె రాజభవన సింహద్వారము జేరునప్పటికి, ముఖ్యమంత్రియు దదితరులును దమతమ కార్యాలయము లోనికి జేరి కూర్చుండియుండిరి. ఆకార్యా లయ మొక విశాలమైన రాజమందిరము. సుల్తాను ఆహాలు లోని ముఖ్యపీఠమున గూర్చుండెను. వానిప్రక్క మంత్రి ముఖ్యులు గూర్చుండిరి. అనేకులు స్వకార్యములకొఱకు గుంపులుకూడి సమయముకొరకు నిరీక్షించుచుండిరి, జనము లోనుండి ముందడుగువైచి యాభాగ్యశాలి సమయమును

కనిపెట్టి సుల్తానుకు వందనముజేసి నిలువంబడెను. సుల్తాను ఆమెవంకజూచి నీవేమిపనిమీదవచ్చితివని యడిగెను. ఆమె తిరిగి సాష్టాంగ నమస్కారముసేసి "నేను జేయబోవు తెలివిమాలిన అభ్యర్థమునకై నాపూనిన ధైర్యసాహసములను మీరు క్షమింపవలయునని మొదలు విన్నవించెను. ఆమె ప్రసంగమువిని సుల్తాను ఆమెకు స్వేచ్ఛగా సంభాషింప నవకాశ మొసంగుటకై ఒక మంత్రిని విడిచి, తక్కిన యుద్యోగియ లెల్లరు సభామంటపము వెలుపలికి బోవలయునని శాసించెను: ఆమె అంతటితో దృప్తిపడక "నాఅభ్యర్థనము మీకేమాత్రము నిందారూపముగ నగపడినను క్షమించగలనని వాగ్దానము సేయనడిగెను." సుల్తాను మంచిది. అదిఏవిషయమైనను గాని మ్మునిన్ను క్షమించ గలను. దానివలన నీకేయపాయము గలుగ నీయము. ధైర్యముతో మాట్లాడుమని హెచ్చరించెను.



అంత నాపుణ్యవతి, మఱియొకసారి క్షమాపణ నర్థించి" ప్రభూ!

వారము దినములక్రిందట తమ కుమార్తె బుద్దీరుర్ బుద్దూరు స్నానార్థ మరిగిన సమయమున నాకుమారు డలాఉద్దీను ఆమె సౌందర్యమును జూచి, ప్రేమించెను. మహాప్రభు వులతో మనకు వియ్యము కొఱగాదని యెంతచెప్పినను వినక ఒకే పట్టుదలతో మీయెడకువచ్చి కన్య నర్థించి రావ లయునని ప్రోత్సహించెను. అందులకు నేను సమ్మతింప కుంటిని. అతడు దేహత్యాగము గావింతుననిపూనుకొనెను. ఈబాధ పడజాలక ఆవిషయము దేవరవారిచెవిని వేయుటకై బయలుదేరి వచ్చితినని పల్కెను. సుల్తాను ఏవిధమయిన ఆగ్రహమును జూపక యించుకమిన్నకుండి ఆ రుమాలలో నున్న పదార్థము లేమని ప్రశ్నించెను. అప్పుడామె కప్పు వలువను దొలగించి వివిధవర్ణముల నవరత్నమయ భూషణ ముల నా సుల్తాను చేతి కందించెను.

ఆ రత్నాభరణముల సౌభాగ్యము చూచిన సుల్తాను ఆశ్చర్యమునకు మేరలేకుండెను. వెంటనే వాటిని ముఖ్య మంత్రికిజూపి, నాకుమార్తెయగు బుద్దీరుల్ బుద్దూర్‌కు ఈ యాభరణములు సమర్థములు లైనవి కావాయని యడిగెను. వజీరును ఆ యాభరణముల పొందికకును దేజస్సునకును మిక్కిలి యానందించెను. అత్యాశ్చర్యము నొందెను. కాని, రాజకన్యకను మూడుమాసములకిృందటనే మంత్రికుమారున కిచ్చుటకు సుల్తాను బ్రసంగించి యుండుటచే ఈయాభరణ ములను రాజకుమార్తెకు జెందజేయుటకు ముందు మూడు

మాసముల వ్యవధి కోరెను. మూడుమాసముల కాలములో నిట్టి యాభరణములు నాకుమారుని వలన, రాజకుమార్తె కీయబడజాలకున్నచో నప్పుడు వానిని బుద్దీరుల్ బుద్దూరు కిప్పించి ఆమెను అలాఉద్దీనుకిచ్చి వివాహము జరుపవచ్చు నని వజీరు ప్రత్యుత్తరము సెప్పెను. ఇంతకంటె ఘనతర మైన బహుమానము నాకుమారుని వలన దమకు సమర్పింపబడగలదని సంభాషించెను. అంత సుల్తాను "అలాఉద్దీను తల్లితో "అమ్మా! మీరు కోరినకోరిక మాకు సమ్మతమైనది. నాకుమార్తెను అలాఉద్దీనుకిచ్చి వివాహముచేయ సమ్మతించితిమి. కాని ఆమెకు మేము పెండ్లికాలమున నీయదగిన సామాను స్త్రీధనము సిద్ధము చేయుటకు మూడుమాసములు గడువు కావలయును. కావున మూడుమాసముల యనంతరము నీవు తిరిగి మాయొద్దకు రమ్ము." అని తెల్పి, ఈనా యభిప్రాయమును నీ కుమారుడగు అలాఉద్దీనుతో నచ్చజెప్పుమని పల్కెను.

అలాఉద్దీనుతల్లి సుల్తానొసంగిన యనుకూల ప్రత్యుత్తరమున కెంతయు సంతసించి సరాసరి యింటికిబోయెను. అలాఉద్దీను తనతల్లిరాకజూచి ఆమెముఖలక్షణము ఆనంద పూరితముగ నుండుటవల్లను శుభవార్త దెచ్చియుండునని విశ్వసించెను. గడపలో గాలుబెట్టినవెంటనే "తల్లీ నాకేమైన యాశయున్నదా? లేక నాజీవితము నిరాశతో తుదముట్టవలసినదేనా యని ప్రశ్నించెను. ఆపుణ్యవతి సుల్తాను సమ

క్షమున జరిగినదంతయు జెప్పి పెండ్లికుమార్తెకీయవలసిన సామాను మూడు మాసములలోపుగా సిద్ధము చేయించి మూడవమాసమున దనకుమార్తెను నీకిచ్చి వివాహము జరిపింతునని సుల్తాను, మంత్రి ముఖ్యుల సన్నిదిలో స్వయముగా తన నోటితో వాగ్దానము చేసెను. ఇదియే నాప్రియత్నమునకు ఫలితార్థము. ఈవివాహము ఇప్పుడే జరుగవలసియుండెను కాని సుల్తాను నా కానుక నంగీకరించి శుభవార్త వినుపింపనున్న సమయమున వజీరుతోనాలోచింపఁగా దుర్మార్గుడగు వజీరు సుల్తానుచెవిలో నేమోచెప్పెను. దానిపై సుల్తాను, మూడుమాసములు గడచిన తరువాత రావలయునని నాకాజ్ఞయొసంగెను." అని కుమారునకు దెలిపెను. జరిగిన వృత్తాంతమువఅకు విని అలాఉద్దీను సంతోషించెను. కాని బుద్దీరుల్ బుద్దూరుపై యనురాగ మంతకంతకు వృద్ధియయిన కారణమున మూడుమాసముల కాలమువరకు నోపిక పట్టుట దుర్భరముగ దోచెను. క్షణమొక యేడుగ కాలము గడుపుచుండెను.

రెండుమాసములు గడచిన తరువాత నొకనాటి సాయంకాలమున, నలాఉద్దీను తల్లి సంజదీజము వెలిగించుటకు బుడ్డిని జూడగా దానిలో నూనెలేకపోయెను. వెంటనే ఆమెకొన్ని నాణెములుచేతనుంచుకొని బజారునకుబోయెను. ఆమె వీధిలో నుండగనే దీపము పెట్టువేళ యయ్యెను. బజారులెల్లను రంగురంగుల విద్యుద్దీపములతో నలంకరింప

బడి యుండెను. అన్నికోనలయందును శుభవాద్యములు వినబడుచుండెను. దుకాణములు మూయబడుటకు బదులుగా నన్నియు మనోహరముగ నలంకరింపబడి తెరవబడియుండెను. ప్రజాసమూహములు తమతమ శక్తికొలది, మేలి రకపు దుస్తులను దాల్చికొని కేరింతలాడు చుండిరి. ఏదోఒక శుభమహోత్సవమున జేయబడదగిన యలంకారము నగరమునందంతట వెల్లివిరియుచుండెను. అచ్చట దిరుగాడువారిలో గొందరిని బిలిచి నగరమున నీయభినవాలంకార మేల జేయబడుచున్నదని యాభాగ్యశాలి ప్రశ్నించెను. వారు "ఓహో! నీవెఱుంగవా? నేటి సాయంకాలమున నగరాధీశుడగు సుల్తాను కుమార్తెయగు బుద్దీరుల్ బుద్దూరును ముఖ్యమంత్రి కుమారునికిచ్చి వివాహము జరుపనున్నారు. శుభమహోత్సవానుకూలముగా నగర మలంకరింపబడినది." అని వారు ప్రత్యుత్తర మొసంగిరి. ఆపేదరాలి చిత్తము తత్తరపాటు చెందెను. ఒక్క నిమిషమైన వ్యర్థముగా పోనీయక, శీఘ్రముగ నింటికిబోయి యీవార్త అలాఉద్దీనుకు దెలియజేసెను.

అలాఉద్దీనుచిత్తము మహాగ్రహపూరిత మయ్యెను. ప్రభువులకు అనృతదోషము లేదుగదాయని వితర్కించి తలపంకించెను. కాని కోపావేశమున నొక్కమాటయేని వెలికిగ్రక్కక "అమ్మా! త్వరలో భోజనము సిద్ధము చేయుమని చెప్పి" యతడు తనగదిలోనికిబోయెను. దీపికా

పాత్రమును గర్జించి రాక్షసునాహ్వానించెను. రాక్షసుడు దృగ్గోచరుడై యేమి కావలయునని యడిగెను. రాక్షసవర్యా! నాకునొసంగు వాగ్దానము జేయబడిన బుద్దీరుల్ బుద్దూరు అను సుల్తాను కుమార్తె నేడు వజీరు కుమారున కీయబడి వివాహము సేయబడుచున్నది. పెండ్లికుమారుడును, పెండ్లి కుమార్తెయు శోభనాలయములో బ్రవేశించిన వెంటనే వారి నుభయులకు నన్యోన్యస్పర్శము గానీయక మంచముపై పండీపండక ముందే వారిరువురతో గూడిన యామంచ మును నాయరలోనికి జేర్చియుంచవలయును.”అని అలాఉద్దీను ఆజ్ఞాపించెను. రక్కసుడు సరియని యదృశ్యుడయ్యెను.

రాక్షసు డించుకతడవు తగుసమయముకొరకు నిరీక్షించుచుండెను. రాజభవనమెల్ల మహావైభవోపేతమై యుండెను. నూతన దంపతులకిక గర్భాదానము కావలసియున్నది. ప్రధానోద్యోగీయుల ప్రోత్సాహముతోఁ ముఖ్యమంత్రి కుమారుడు పెండ్లి కుమార్తె శోభనపు గదిలో ప్రవేశించెను. ముందుగా సెజ్జ నలంకరించెను. పదంపడి రాజసాధ్వి పరిచారికలతోఁ బెండ్లికుమార్తెను శోభనపు గదిలోనికి దీసికొని వచ్చెను. అప్పటియాచారము ప్రకారము మంచముపై నెక్కుటకు బెండ్లికుమార్తె బెట్టుసేయు చుండగా రాజసాధ్వి యామెను బలాత్కరించి, మేలిముసుంగును దొలగించి మంచముపై గూర్చుండబెట్టి పోయెను.

శోభనపు బెండ్లికొడుకు పెండ్లికుమార్తె నొక్క ముద్దయిన పెట్టుకొనలేదు. సరికదా కరస్పర్శమైనఁ జేయలేదు. తలుపులు మూయబడిన క్షణకాలములో రాక్షసుడు వారి మంచము నదృశ్యరూపమున నెత్తికొనిపోయి అలాఉద్దీనుగదిలో నుంచెను. నూతనదంపతుల యుత్సాహము చల్లబడి నిర్విణ్ణ చేతస్కులై మంచముపై బడియుండిరి.

అలాఉద్దీను రాక్షసు డందుజేరగనే, "నీవీ క్రొత్త పెండ్లికుమారుని, ఈవెలుపలనున్న చీకటిగదిలోనికిఁ జేర్చి తలుపుభద్రముసేసి రేపు సూర్యోదయమునకు బూర్వమే రమ్మని యాజ్ఞాపించెను. వల్లేయని రక్కసుడు మంత్రి కుమారుని చీకటిగదిలో నుంచి పెద్దచలిలో వస్త్రహీనునిగా విడిచి వానిపై నొక్కమాఱూది యిటునటు గదలుటకుశక్తి లేకుండజేసి తన త్రోవనే వెడలిపోయెను.

అలాఉద్దీను రాజకన్యకను దగుగౌరవముతో నాదరించి "రాజకుమారీ! భయపడకుము. నీ గౌరవమునకు హానిసేయను. నీతండ్రి నిన్ను నాకొసంగ మూడుమాసముల యనంతరము వాగ్దానము సేసెను. మఱియొకనికి నిన్ను వివాహమాడు హక్కులేదు. శత్రువుడు నిన్ను వివాహముచేసికొని నా యనురాగమును గ్రిందుసేయ నుండుటవలన నేను నిన్నీయవస్థలోనికి దీసికొని వచ్చినాను" అని పక్కమంచముపై బండియున్న యామెప్రక్కకు వీపుజేసి, ఇరువురమధ్య నొక ఖడ్గమునుంచి పెండ్లికొడుకు స్థానమున

దానును బండుకొనెను. ఆమె గౌరవమునకు హానికరమగు చర్యజేసిన యెడల నామె తన శస్త్రముతో బొడిచి చంప వచ్చునను నాశయమామెకు దెలియునట్లుగా నతడా శస్త్రము నందుంచెను. బుద్దిరుల్ బుద్దూరు తన జీవితములో అటు వంటి దుర్దినము నెన్నడును జూచియుండలేదు. ఆరాత్రి యందువలె నామెచిత్త మెన్నడును బాధపడి యుండలేదు. ఇక నా చీకటికొట్టులోని దురవస్థ నేమనివర్ణింపగలము ? కొత్త పెండ్లికుమారునకారాత్రి చలియుఁ జీకటియు భోగిను లయిరన్నచో-సమంజసముగా నుండును. తెల్లవారుపూర్వమే అలాఉద్దీను తన శస్త్రమునుదీసికొని పంచముదిగి, పక్కొక గదిలోని కేగెను. యుదయమున, యజమాని యాజ్ఞప్రకారము రక్కసుడుప్రత్యక్షమై "యేమియాజ్ఞ" అని అలాఉద్దీను నడిగెను. మంత్రికుమారుని జీకటికొట్టులోనుండి తెచ్చి ఈ శోభనశయ్యపై బరుండబెట్టి ఇరువురితోగూడ నీ మంచ మును రాజసౌధములోని శోభనపుగదిలో నుంచిరమ్మని అలాఉద్దీ నాజ్ఞాపించెను. క్షణమాత్రకాలమున రక్కసు డాతని యానతి ప్రకారము సేసి యదృశ్యుడయ్యెను. వధూ వరులు అలాఉద్దీనుకు రాక్షసునకు జరిగిన సంభాషణలు వినియుండలేదు. మంచము కదలిపోవుచున్నదని తెలిసికొ నిన మాత్రముననే వారి పంచప్రాణములు చల్లబడిపోయి నవి. ఇక రాక్షసుని వికారస్వరూపమునే వారు జూచియు న్నచో జీవించి యుండరనుటకు సందియములేదు.

ప్రొద్దు ప్రొద్దునలేచి సుల్తాను కుమార్తె శోభనాల యము తలుపు తెఱవబడిన వెంటనే లోనికి బ్రవేశించి, మంచముపై గూర్చున్న పుత్రికను జూచెను. కనుబొమ్మల నడుమ ముద్దిడుకొని కుశలప్రశ్నముసేసెను. కాని యామె బదులు సెప్పక మిన్నకుండెను. అతడేదో యసాధారణ చర్య జరిగియుండునని గ్రహించి తిన్నగా, తన పట్టపు హిషి మందిరమునకు బోయెను. సుల్తాను రాజసాధ్వికి దన యనుమానముజెప్ప నామె స్వయముగా గుమార్తె దగ్గరకు వచ్చి ముద్దిడుకొని కడచినరాత్రి జరగిన యంశ ములు సెప్పుమనెను. కాని అప్పుడును రాజకుమార్తె నసం తోషమున బదులు సెప్పక మిన్నకుండుటచేఁ దల్లిమనస్సు నకును కడచినరాత్రి యేదో వైపరీత్యము జరిగెననిదోచెను. పదంపడి వజీరు కుమారునిబిలిచి రాత్రి యేమిజరిగెనని యడుగగా నాతడును గౌరవ పోషణార్థమై యేమియు దెలియ జెప్పలేదు.

వైవాహికోత్సవ వైభవములతో నగరమెల్ల మారు మ్రోగుచుండగా, సూర్యుడస్తమించుకాలమాసన్నమయ్యెను. అలాఉద్దీను రాక్షసుని బిల్చి "నేటిరాత్రి తప్పక యానూతన దంపతులు శోభనాలయము జేరుదురు. తిరిగి నీవు నిన్నటి వలె వారిని మంచముతోసహా యిచ్చటికి దీసికొనిరమ్ము. వజీరు కుమారుని నిన్నటిచీకటిగదిలో నిర్బంధించు"మని యాజ్ఞాపించెను. రక్కసుడు వల్లేయని అంతర్హితుడయ్యెను.

రాత్రికాలమయ్యెను. శోభనోత్సవాభిలాషులగు దంపతులు గడచిన రాత్రియందు శయ్యల నధివసించియున్న సమయమున గరస్పర్శాదులు గాకమునుపే, రాక్షసుడగోచర రూపమున వచ్చి మంచమును దీసికొని పోయి అలాఉద్దీను గదిలోనుంచి తిరిగి మంత్రికుమారుని జీకటిగదిలో నిర్బంధించెను, నాటిరాత్రివలె నేటిరాత్రియును గడచెను. ఉదయమున దిరిగి వజీరుకుమారుని మంచముమీదికి జేర్చి రాక్షసుడామంచమును అలాఉద్దీను ఆజ్ఞప్రకారము రాజసౌధములోని శోభనాలయమున నుంచి యదృశ్యుడయ్యెను.

అంతలో సుల్తాను దలుపుదట్టెను. వజీరుకుమారుడు రెండవరాత్రి జరిగినప్రకారమునకు మరింతసిగ్గుపడి, సుల్తానుకగపడకుండగనే, మంచమునుండి దుమికి, వస్త్రధారణాలయములోనికి బరువెత్తెను. సుల్తాను కుమార్తెయొద్దికివచ్చి కనుబొమ్మలనడుమ తిరిగి ముద్దులిడికొని "అమ్మా ! కడచినరాత్రి చర్య సుఖకరముగా నుండెనా అని అడిగెను. ఆమె మౌనమునే ధరించి యుండెను. అంత నతడు కత్తి దూసి, నీవు మాటాడని పక్షమున నఱికివేయుదునని బెదరించెను. అంతనామె భయపడి, కడచినరాత్రి జరిగిన క్లిష్ట పరిస్థితిని దెలియజేసి దుఃఖించెను. నావార్తలు వజీరుకుమారునడిగి ధ్రువపఱచు కొనుడనియు హెచ్చరించెను. అట్లయిన విచారింపకుము. నీకు సుఖము నొసంగు హృదయేశ్వరుని

గూర్చి నీసౌఖ్యమును గాపాడెదనని చెప్పి యోదార్చి వెడలి పోయెను.

పదంపడి సుల్తాను వజీరు మందిరమునకు బోయి, తన కుమార్తె చెప్పిన సమాచారము వినిపించి, నీకుమారునివలన గూడ గతరాత్రి జరిగిన చర్యనుగురించి వినవలనని ప్రోత్సహించెను. వజీరు అందులకు సమ్మతించి, సుల్తాను సెలవుదీసికొని తిన్నగా తనకుమారుని యొద్దకు బోయెను. కొత్తపెండ్లికుమారుని జేరబిల్చి, సులాను ఆనతిగా కడచిన రాత్రి చర్యను వినిపింపుమని యడిగెను. ఏవిషయమును నీవు దాచక చెప్పవలయునని హెచ్చరించెను.

అంత నా పెండ్లికుమారుడు "నాయనా : సుల్తాను కుమార్తెచెప్పిన యంశములలో నేమియు నసత్యములేదు. అదిగాక నేను బడిన మహాబాధ ఆమెకు దెలియదు. కడచిన రెండు రాత్రిలలలో మా మంచము నాలుగుమాఱులు నిరాధారముగా పెద్దదూరము ప్రయాణము సేసినది. ఎవ్వరు మోసికొని పోయిరో, ఎట్లు కదలిక పుట్టినదో యూహించుటకైన నలవిగాని చందమున నీవైపరీత్యము జరిగినది. ఉష్ణతారహితమైన చీకటికొట్టులో నిర్బంధించబడి, నేననుభవించినబాధ చెప్పనలవికాదు. ఇట్టియసంగత వివాహము చేసికొని సుల్తాను కుటుంబముతో వియ్యము నెయ్యము కాపాడుకొను ప్రయత్నము చేయుటకంటె ననాయాస మరణము మేలుగా దోచుచున్నది. శీఘ్రముగా మాయీ వివా

హము రద్దు చేయించెతివేని నన్ను కాపాడుకొనినవాడ వగు దువు." అని ఈర్ష్యావృత్తితో ఖండితముగా బ్రత్యుత్తరము సెప్పెను.

వజీరు కుమారుని నోటివెంట భయప్రదవార్తలు వినినతోడనే, సరాసరి, బయలుదేరి సుల్తాను దర్శనమునకు వచ్చెను. ఆలోచనమందిరములో గూర్చిండి వజీరు సుల్తాను లిరువురును దమ వియ్యమునకు భంగకారణములైన యుప ద్రవములను పరస్పరము తెలియజెప్పుకొని, యానూతన వివాహమును రద్దుసేయవలయునని నిశ్చయించుకొనిరి. వజీరు సుల్తానుతో దమ కుమార్తెను నాకుమారున కియ్య నక్కరలేదని వేడుకొనెను. సుల్తాను నా కుమార్తెయగు బుద్దీరుల్ బుద్దూరును నీకుమారుడు వివాహము సేసికొన వలసిన నిర్బంధములేదని వజీరుతో భాషించెను. వివాహము జరుగుటలేదని నగరములోనికి వార్తలు ప్రసరించెను. వివాహోత్సవ అలంకార వైభవమంతయు నిలిపివేయ బడె నని, నగరవాసులెల్ల నిరాడంబరముగ శాంతిమార్గావలం బులై కాలక్షేపము సేయుచుండిరి.

అలాఉద్దీనుకు, సుల్తాను తన కుమార్తెనిచ్చుటకు గడువుగా నియమించిన మూడుమాసములు క్రమముగా కనచినవి. గడువు పూర్తి అయినంతవరకు నిరీక్షించి, అలా ఉద్దీను తన తల్లిని సుల్తానుకు బుద్దీరుల్ బుద్దూరుకును దన కును జరుగవలసిన వివాహవిషయమై యతని వాగ్దానమును

జ్ఞాపకము సేయుటకొరకు రాజసౌధమునకు బంపెను. అతనితల్లి సూటిగా సభామంటపమునకు బోయి పెందల కడనే సుల్తాను దృక్పథములో పూర్వప్రకారము మిన్నక నిలుచుండెను. సుల్తాను ఆమెనుజూచి వజీరు చావింపనున్న దినచర్యా నివేదికను నిలుపుదలసేసి యామెను లోనికి రప్పింప నాజ్ఞయిచ్చెను. ఒకవేత్రధారుని సహాయముచేత నామె సుల్తాను సింహాసనము నొద్దికివచ్చి సాగిలబడి సలాముసేసెను. నీవు చెప్పదలచుకున్నదేమని సుల్తాను ప్రశ్నించెను. అంతనామె యాచారము ప్రకారము సింహపీఠి కడ సాగిలబడి సలాముచేసి, రాజకుమార్తెను నాకుమారు డగు నలాఉద్దీనుకు నీయ వాగ్దానముసేసి మూడుమాసములు గడువుపెట్టితిరి గడువుఅనంతరము నేను రావలసినదిగా నాజ్ఞాపించిరి. ఆవిషయము దేవరవారి చిత్తమునకు జ్ఞాపకము సేయుటకు వచ్చియుంటినని సవినయముగా మనవి సేసెను. ఆమెముఖ చిహ్నముల వలన సూచింపడుచున్న దారిద్ర్యమును; ఆమెధరించిన వస్త్రములు సూచించుచున్న పేదరికమును గుర్తించి, యిట్టి యభాగ్యురాలి యింటికి దన కుమార్తె నిచ్చుట తగదని మనోనిశ్చయము సేసికొనెను. కాని తాను చేసిన వాగ్దానమును దప్పించుకొను నుపాయము కావలసియున్నది. అందులకై తన వజీరు వంకజూచి కర్తవ్యమేమని యడిగెను. వజీరును సుల్తాను అభిప్రాయమును గ్రహించి సుల్తాను వంకజూచి "వాగ్దానమునుండి మనము

తప్పుకొనరాదు. కావున ప్రపంచములో నెవ్వరికిని సాధ్య కాని ద్రవ్యము చేకూర్చదగిన కానుక పెండ్లికాలమందీయ వలయు ననియు అట్లయినచో కన్యకనిచ్చి వివాహము సేయింతుమనియు నానతిండు. దానిని సాధించితెచ్చి ఈయ నేరక అతడే స్వయముగ వివాహము విరమించు కొనగ లండని వజీరు సలహాచెప్పెను. సుల్తాను అతని సలహా ప్రకారము అమెతో నలుబదితొట్టెల బంగారమును తొల్లిటి వలె మణిమయ భరణములును సిద్ధముచేసి వాటిని నలుబది మంది నల్లసేవకుల శీర్షములయందుంచి వారిముందు ఉత్త ముములై, రాజార్హములైన దుస్తులు ధరించి నలుబదిమంది తెల్లసేవకయువకులు ముందు నడయాడ గైకొని వచ్చి కానుకగా నర్పించితివేని, నాకుమాత్రెయగు బుద్దీరుల్ బుద్దూరు నాతనికిచ్చి వివాహము జరిపించెదమని నీకుమారు నకు జెప్పుము. మీనుండి ప్రత్యుత్తరము వచ్చువరకు నిరీ క్షించి యుండగలమనియు దెల్పెను.'' అని పల్కెను. ఆ యానతిని, అలాఉద్దీనుతల్లి, సుల్తానుకు రెంశవసారి సాగిలి సలాముసేసి తనయింటికి ఛోయెను.

ఆమె తిరిగిపోవు సమయమున తనకుమారుని యవివేకమును దలచి పరిహసించుచు ఇన్ని బంగారపు తొట్టెలను వాటి నిండార రత్నాభరణములను నితడెక్కడి నుండి తేగలడని తనలో తాను వితర్కించుకొనెను. ఆ భాగ్యవతి వెంటనే ఇల్లుసేరి "తాను సుల్తానుకు వివాహమును

గుఱించిన వాగ్దానము జ్ఞాపకము జేసితిననియు, అతడు కొంచెము ఆలోచించి, తన వజీరుజూడగా నతడు సుల్తాను చెవిలో నేమో రహస్యముగ మాట్లాడె ననియు, పిదప నతడొక దుర్ఘటమైన షరతు పెట్టదలంచి రత్నాభరణ పూరితములైన నలుబది బంగారపు తొట్టెలను మోయు నల్ల సేవకుల నడపు మహారాజార్హ వస్త్రాలంకృతులైన తెల్ల సేవకులతో వచ్చిన యెడల సుముహూర్తము నిశ్చయింప బడగలదనియు చెప్పెనని తెలియజేసెను. మఱియు తనడు పెంటనే లెమ్మని కోరెనుగాని, కొంచెము దీర్ఘకాలమైనను నిరీక్షించుచుండగలడని నావిశ్వాసమనియు చిఱునగవుతో జెప్పెను. అలాఉద్దీను తల్లి యాలపనముల నాలకించి "ఆమెపై నాకుగల యనురాగ మింతకంటె నెక్కువ విలువకోరునదియే. అతడడిగినది చాలతక్కువ. నీవంగడికి బోయి భోజనద్రవ్యము తయారుగతెచ్చి, వంటజేసి నన్ను బిలువు"మని యామెను వీధిలోని కంపించెను.

తాను దీపపాత్ర స్థానమునకు బోయి, రాక్షసుని బిల్చి సుల్తాను దన కుమార్తెను నాకిచ్చుటకై యిట్టి బహుమానము కావలెనని షరతుపెట్టెను. కావున రేపటి యుదయము రాజకార్యాలయము తెఱవబడు పూర్వము దానిని సిద్ధపరచుమని యాబహుమతి స్వరూపమును విశదముగా జెప్పెను. నారాక్షసుడు నీయాజ్ఞ తత్‌క్షణమే నెఱవేర్తునని పల్కి యంతర్ధాన మయ్యెను. తిరిగి క్షణకాలముననే యా

పిశితాశనుడు యెనుబదిమంది తాదృశ్య పరిచారకులతో నతని వర్ణన ప్రకారము బహుమతిని మోయించుకొనివచ్చి యింట నిల్పి, మఱేమయిన కావలయునాయని యడిగి యలాఉద్దీను సెలవుతీసికొని వెడలిపోయెను.

ఆ భాగ్యశాలి బజారునుండి యింటికివచ్చి చూచు నప్పటికి యిల్లు యెనుబదిమంది పరిచారకులతోడను రత్నాభరణములతో నిండిన నలుబది బంగారపు తొట్లతోడను, నిండి మహావైభవముతో చులదూగుచుండెను. అలాఉద్దీను ఆమెతెచ్చిన యాహార సామగ్రి నొక్కచోటఁ బెట్టించి, "తల్లీ! ఆలసింపవలదు. ఈవధూ బహుమతిని దీసికొని, నీవు రాజసౌధమునకు బొమ్మనివేడెను. వాకిటిపెలుపు తెలి చెను. వీరయెల్లరు తనవెంటరాగ, నాభాగ్యశాలి కట్నముతో రాజసౌధమునకు బోయెను. తెల్లపరిచారకులు బజారువెంట నడచునప్పుడు వీధిప్రక్క యిండ్లవారు స్త్రీపురుషులెల్లరు వాకిటి గుమ్మములందు నిలువబడి, వారి రత్నాలంకృతములైన బంగారు జరీతలపాగాలను, మణీ స్థాపితములైన బంగారు జరీపట్టు నడుము పట్టాలును, పైడి జరీఅంచుల మధ్య చిన్న రత్నముల శిల్పముగల పొడుగాటి యంగరకాలను జూచుచు మహానందాశ్చర్యములను బొందుచుండిరి. మొదటి శ్వేత పరిచారకుడు రాజభవనద్వారము జేరునప్పటికి, యిచ్చటి సుల్తాను కొపలివాండ్రు వరుసలో నిలువబడి, యతడొక రాజుగా భావించి సలాములు చేయబోయిరి. కాని

యతడు తన రాక్షసాధీశుని యానతి ప్రకారము సభాము లందుకొనక తాము పరిచారకులమనియు తమయజమాని వెనుకనుంచి రాగలడనియు సమాధానము సెప్పెను.

ప్రధాన పరిచారకుని వెంట బరిచారకు లెల్లరు నప్పుడే తెరువబడి, రాజ రాజ ప్రధానా ద్యుద్యో గియా లంకృతమైన రాజ కార్యాలయములో బ్రవేశించి, యి రు ప్ర క్కల బారులు దీర్చి యాచారము చొప్పున సాష్టాంగ వందనములు సేసి సువర్ణ భాజనముల సుల్తాను మ్రోలనిడి,



చేతులు గట్టుకొని నిలుచుండిరి. కాల పరిచారకులు రత్నా భరణములపై గప్పబడిన పట్టుపెడి జరీల యుపవస్త్రములను దొలగించిరి. రాజకార్యాలయమెల్లను మహా తేజోవిరాజ మానమై, దేవలోక మహా శోభావైభవమును ధిక్కరించు చున్నట్లు శోభిల్లెను. ఆభాగ్యశాలి వందనాదులుసల్పి సుల్తా నుతో, రాజరాజా! తమ యభిలాష ప్రకారము నా కుమా రుడు ఈ పెండ్లిపిల్ల కట్నమునంపినాడు. బుద్దూరు మహా

గౌరవమున కియ్యతగినవి గాకున్నను, మీరామెకు నచ్చ జెప్పి, మెప్పించి, మీవాగ్దానమును నెఱవేర్పవలెనని ప్రార్థించుచు, దృఢ విశ్వాసముతో సందేశము నంపినాడని మనవి చేసెను.

రారాజు మణీ భూయిష్ట మహాభాగ్యమును జూచి, హృదయపూర్వకముగా సంతోషించి తనకింక నేయభిలాషలున్నను కోరకుండగనే సిద్ధింపగలవని విశ్వసించి, కర్తవ్యాచారముపూరించుటకు మంత్రివంకజూచెను. మహాబుద్ధిశాలియగు ముఖ్యమంత్రి సుల్తాను సంపూర్ణాభిప్రాయము గ్రహించి యీ బహుపరిధాతమ గౌరవసత్కారముల కర్హుడేయని సమ్మతిసూచించెను. సుల్తాను అలాఉద్దీను తల్లి వంకదిరిగి "భాగ్యవతీ ! నీ కుమారుడంపిన వధువుకట్నము మా కెల్లరకును సంతృప్తికరముగానున్నది. నీవు శీఘ్రముగ బోయి, మేమతని కోర్కె నెరవేర్చుటకు సర్వసిద్ధముగ నున్నారమనియు, నెంతశీఘ్రముగ వచ్చునో అంత అధికానందము మాకు గలుగుననియు జెప్పుమని యానతిచ్చి యాసాధ్విని సగౌరవముగ బంపెను.

సుల్తాను అప్పటికి నాటి సభాకార్యక్రమము జాలించి, తన కుటుంబమువారి నెల్లరకు గవాక్షములనుండి యీ పరిచారకగణమును మణీ సువర్ణ భాజనములను గన్నులార జూచునట్లు సేసెను.

ఇంతలో అలాఉద్దీనుతల్లి యిల్లుజేరి శుభవార్తను కుమారున కెఱింగించి "సుల్తాను నీకు స్వాగతమొసంగుటకు సిద్ధముగ నుండుటయేగాక ప్రతినిమిషమును నీకై యెదురుచూచు చున్నాడు. అతనికి నీయందు గొప్ప గౌరవాభి ప్రాయ మేర్పడినది. దానికి దగినట్లుగా దగిన యేర్పాటులను జేసికొని తడవుసేయక రాజసౌధమున కేగుమని చెప్పెను. ఈ శుభవార్తవిని అలాఉద్దీను అపరిమితానంద భరితుడై, తనచాటు మందిరము లోనికిబోయి రాక్షసుని బిల్చి "నన్నిప్పుడు స్నానముజేయించి. రాజాధిరాజులు ఇదివరకెన్నడును ధరించి యెరుగని అమూల్యమణి సువర్ణాంచలపీతాంబరములను ధరింపజేయుమని కోరెను. ఒక్క త్రుటి మాత్రకాలమున నాపిశితాశనుడు ఒక మహారాజభవనమును, దాని ప్రక్కగ నొక స్నానపు గదిని మఱికొన్ని యుష్ణదారక్షణార్హములగు గదులను సృష్టించి, అలాఉద్దీనును సువాసనామిళితమగు నుష్ణోదకములో స్నానము చేయించుచు, చిత్రవిచిత్రపు సువాసన సబ్బులతో మేను శుభ్రపరచి అతని మేనికి గొప్పింబసిడి చాయ యబ్బునట్లును నసాధారణ కౌశల్యము గలుగునట్లును జేసి, యధాభిలషితముగ రాజాధిరాజానను భూతములగు నమూల్యాంబరములను ధరింపజేసి మఱియేమి కావలయుననియడిగెను. అంత నలాఉద్దీను "నాకొక యశ్వరాజము కావలయును. అది మిక్కిలి సుందరమై సర్వవిధగతి చాతుర్యముగలిగి,

సుల్తాను తురంగశాలలోని యన్ని యశ్వములకంటె నధిక మైన యాకర్షణశక్తి గలిగియుండవలయును. దానిపై జీనును కళ్ళెమును యితర సామానులును విలువ కట్టబడినచో నొకకోటి బంగారు నాణెములు చేయునట్లుండవలయును. మఱియు నాకు అమూల్యాంబరముల ధరించు నలువదిమంది పరిచారకుల నిమ్ము. పది సంచులలో పదివేల బంగారు నాణెముల నింపితెమ్ము మాతల్లి సేవసేయుటకు ఒక్కొక్కతె యొక్కొక్క మహారాజ పట్టమహిషియో యనునట్లు విరాజిల్లు నారుగురు సేవకాంగనలనిమ్ము. సుల్తానుభార్య ధరించు వస్త్రములకంటె వారి వస్త్రాదులు అధిక శోభావంతము లనదగునవిగా గూర్చుము. త్వరగా సేయుము. పొమ్మని యాజ్ఞాపించెను.

కనురెప్పపాటు కాలములో నాయసురుడు పదిసంచుల బంగారు నాణెములను నలుబదిమంది సేవకులను ఆరుగురు పరిచారికలను, ఒకయాజానే యాశ్వమును తదితర సామగ్రిని దీసికొనివచ్చి యెూఉద్దీను కప్పగించెను. బంగారునాణెముల సంచులు పదిటిలో నాలుగుదీసికొని తనతల్లి యవసర వదార్థములకొఱ కిచ్చెను. మిగిలిన యాఱు సంచుల నాణెములను మొదటి వరుస సేవకులకిచ్చి తాను గుఱ్ఱము నెక్కి రాజసౌధమునకు బోవునపుడు మునుముందు నడచుచు జనసమూహముల ప్రక్కకు జల్లుచుండ వలయునని యాజ్ఞాపించెను. ఆరుగురు పరిచారికలు దెచ్చిన యమూ

ల్యాంబరములను దనతల్లికి ధరింపనిచ్చెను. అప్పటి కా యసురవల్లభునకు అలాఉద్దీను సెలవొసంగిపంపెను.

ఇరువది మంది సేవకులను రెండుపంక్తులుగా దీర్చించి ముందుకు నడచుటకును మిగిలిన యిరువదిమందిని అశ్వమువెంట వెనుకప్రక్క నడచుటకును నాజ్ఞాపించి అలాఉద్దీను అశ్వరాజము నధివసించెను. అశ్వరాజము అపూర్వ సౌఖ్యదాయకమైన గమనవైఖరితో ముందడుగు



వైచెను. ముందటి యిరుప్రక్కలలో నిమిషియున్న అరుగుల రెండు ప్రక్కల నుండి తమకీయబడిన బంగారు నాణెముల సంచులలోనుండి నాణెములదీసి వెదజల్లుచుండిరి. అరుగురు పరిచారకులు తల్లివెంట నంటి మహారాణికి దారి సేవసేయుచు నడయాడుచుండిరి. నలుబదిమందిలో నొక్క సేవకుని తన రాక సుల్తాను కెరిగించుటకై తాను బయలుదేరుముందే

పంపియుండుటచే, సుల్తాను ఆ వార్తను దెలిసికొని యా సేవకుని సమర్యాదగా వెనుకకు బంపి, తాను స్వాగత మొసంగుటకు సిద్ధముగా నున్న విషయమును అలాఉద్దీను కెఱింగించియుండెను. సుల్తాను రాజకార్యాలయములో సకల సామంత సమేతుడై సభసేసి యలాఉద్దీను రాకకై నిరీక్షించుచుండెను. అలాఉద్దీను సింహద్వారము నొద్దికిజేరి ద్వారపాలకుని లోనికిబంపి తన యాగమనమును సుల్తాను కెఱింగించెను. సుల్తాను నాజ్ఞప్రకారము ద్వారపాలకుడు అశ్వావరోహణముసేయనున్న అలాఉద్దీనును గ్రిందకు దిగనీయక అతనిగుఱ్ఱమును బరిచారకులను రాజకార్యాలయముదనుకను గొంపోయెను.

అలాఉద్దీను అచ్చట హయరాజమునుండి క్రిందికి దిగెను. ద్వారమునుండి సుల్తాను సింహాసనమువరకు రెండు పంక్తులుగా దీర్చియున్న యుద్యోగీయులలోని యగ్రగణ్యుడు అలాఉద్దీనును దన కుడిభాగమున నడువజేయుచు సింహాసనము దనుకను దీసికొనిపోయెను. అలాఉద్దీను సుల్తాను పాదములసంట నుంకించు సమయమున సుల్తాను సింహాసనమునుండి లేచి, రెండుమెట్లు క్రిందికిదిగి, చేయి పట్టుకొని కదలించి, అలాఉద్దీనును గౌగలించుకొనియెను. సుల్తాను అతనిచేయి గట్టిగా బట్టుకొని యతనికొఱకు నియమింపబడిన గౌరవపీఠిపై గూర్చుండబెట్టెను. అలాఉద్దీను ఉచితాసనము నలంకరించి "రాజరాజా! మీరొసంగిన గౌర

వమును సంతోషముగ స్వీకరించుచున్నాను, అనిపలికెను. సుల్తాను కానున్న యల్లుని బిగియార గౌగలించుకొనెను.

అంత సుల్తాను నౌకర్లకొక సంజ్ఞచేసెను. మంగళ వాయిద్యములు మ్రోయసాగెను. వివిధములైన మధుర వాద్యములు పదినిమిషములవరకు మ్రోగిన పిమ్మట సుల్తాను అలాఉద్దీను చేయిపట్టుకొని, మహావైభవముతోదూగాడు చున్న విందులభవనము లోనికి దీసికొనిపోయెను. అందు నలుదిక్కుల విందుబల్లలు కుర్చీలు నమర్చబడి యుండెను. పెండ్లికుమారునకు బ్రత్యేకస్థాన మేర్పాటు సేయబడియుండెను. వానిప్రక్క మామయును గూర్చుండెను. ఉద్యోగి యులు మంత్రులు, సామంతులు తమతమ యధికార గౌరవముల ప్రకారము తమకై యమర్చబడిన ప్రత్యేకస్థానములయందు గూర్చుండిరి. అందఱును రాజాధిరాజోచితమగు విందు నారగించిరి.

శుభసమయ ప్రసంగానంతరము సుల్తాను అలాఉద్దీనుతో నీవు భవనములోనుండి నేడే వివాహధర్మములను నిర్వర్తింప జేసికొమ్మని సంభాషించెను. అందులకు అలాఉద్దీను రాజరాజా! నేను రాకుమారి వసించుటకు దగురీతిగా భవనమును నిర్మాణము సేయునంతవరకు వ్యవధికావలెను. తగిన శ్రద్ధతో అతిశీఘ్రకాలమున భవననిర్మాణము చేయించెదను. కాని రాకుమారి తమసౌధమునకు నతిసమీపములో నుండునట్లును రాకపోకలకు అత్యంతావకాశము గలిగియుం

డునట్లును నూతన సౌధ నిర్మాణము చేయవలయునని నా యభిప్రాయము. కావున దాని కనుకూలమైన విడి ప్రదేశము నాకనుగ్రహింపవలయునని నాయభిప్రాయము. కావున దాని కనుకూలమైన విడిప్రదేశము నాకనుగ్రహింపవలయునని కోరెను. సుల్తాను మీయుభయుల ఏకీభావమును జూచుటకు నామనస్సు చాల తొందరపడుచున్నది. అయినను నీవు పేర్కొనిన ప్రకారము భవననిర్మాణము అత్యవసర విషయమగుటచే నీ యిష్టానుసారము వ్యవధియిచ్చుటకు సమ్మతించుచున్నాను. మారాజస్థానముచుట్టును వలసినంత విడిప్రదేశమున్నది. నీయిష్టము వచ్చినచోట భవనము నిర్మించవచ్చును, అనిచెప్పి అలాఉద్దీనును, మఱి యొకసారి ప్రేమపూర్వకముగా గవుగలించుకొనెను. అలాఉద్దీను రారాజు నిజగృహంబున బెరిగినవారు చూపునంతటి భక్తితోను, ప్రేమానురాగముతోను సుల్తాను సెలవుదీసికొని నిజ నివాసమున కేగుదెంచెను.

అలాఉద్దీను ఇల్లుచేరిన వెంటనే తన రహస్యమందిరమున కేగి తన రాక్షస సేవకుని బిలిచెను. తోడ్తోనతడు గానవచ్చి యేమి యానతియని యడిగెను. అంత నాయువకుడు "రాక్షసమిత్రమా! ఇంతవరకు నీవు నీకృత్యములలో కడునేర్పరితనముతోను అవసరానుకూలముగను ప్రవర్తించితివి. సర్వమును శుభమగుచున్నది. ఇప్పుడు సుల్తాను దనకుమార్తెను నాకీయ నంగీకరించెను. భవన

నిర్మాణమునకు దగిన ప్రదేశమును బ్రసాదించెను. భవన నిర్మాణము వ్యవధిగా వివాహము జరుగగలదు. కావునఁ జూపబడిన ప్రదేశములలో నేను నా యర్ధాంగి నుంచుటకు దగిన రాజసౌధము నొకదానిని నిర్మింపవలయును. రాక్ష సుడు "చిత్తము, దేవరా"యని క్షణకాలములో నదృశ్యు డయ్యెను.

మరునాటి యుదయమున అలాఉద్దీను నిదురలేచి, శయ్యవీడకముందే, రక్కసుడువచ్చి అలాఉద్దీనుకు మాత్ర మగపడుచు "దేవా! తమ యాజ్ఞప్రకారము రాజభవనము తయారుచేయించితినని చెప్పి నూతన నిర్మాణమును నీవొ క్కసారి చూడవలయునని కోరెను. అలాఉద్దీను సరేయని సమ్మతీసూచన చేసిన తత్‌క్షణమే యాయసురుండతనిని తటాలున నూతనభవనమును జూపుటకు దీసికొనిపోయెను. సభాభవనములు, స్నానమందిరములు, పాకశాలలు, అశ్వ శాలలు, ధనాగారములు, శుద్ధాంత మందిరములు, కేళికా స్థానములు, ఉపవనములు, మున్నగు సర్వభాగములును అలాఉద్దీనుకు గనువందువ సేసినవి. ముఖ్యముగా ఆ భవన రెండవ అంతస్సుపైన నిర్మింపబడిన యిరువదినా లుగు గవాక్షముల వివిధరత్నస్థగిత కాంచన కలధౌత నిర్మి తమగు పెద్ద హాలుయొక్కదృశ్యము అలాఉద్దీనుకు ఒడలు మరపించనయిన సంతృప్తి నొసంగినది. అన్నిగదులలోను తగురీతి కార్యక్రమము నడుపు పరిచారకులు ఉద్యోగులు

అధికారులు పనిచేయుచుండిరి. వివిధములైన బంగారు నాణెములు ధనాగారమునందెల్ల గుట్టలు గుట్టలుగా నమర్చ బడి యున్నవి. కొన్నిగదులు ప్రత్యేకవర్ణముల రత్నరాసు లతో గిక్కిరిసి యున్నవి. రత్నకాంచన సౌధము నామూ లాగ్రముగాజూచి అలాఉద్దీను సంపూర్ణముగ సంతృప్తి పడినతర్వాత నతనియాజ్ఞప్రకార మతనిని పురాతన గృహ మునకు దీసికొనిపోయి విడిచెను.

కొంతసేపటికి తూర్పు తెలవారెను. సుల్తాను భవన ద్వారములుతెఱవబడెను. ద్వారపాలకులచే నీలపుబట్టు రత్న కంబళములు జూడబడెను. వాటిమార్గమున గొంతదూరము



పోయి తలలెత్తువరకు మణిభవనము కనుగ వకు మిఱుమిట్లు గొలి పెను. తిరిగి పైకిజూడ "అలాఉద్దీను విలాసభ వనము"అను నక్షర ములు రంగుల మణు లతో నమర్చబడియుం డెను. వారు మహానం దముతో సుల్తానునొద్ది కిబోయి "తమయల్లుడు భవనము సిద్ధము

చేయించె"నని మనవిచేసిరి. ఈవార్త రాజభవనమునం దంతట క్షణములో వ్యాపించెను. ముఖ్యమంత్రి కోటకువచ్చి సుల్తానును గలసి, యిదియంతయు నింద్రజాల విద్యాఫలితమని, సుల్తానును నమ్మించుటకు ప్రయత్నించెను గాని యతడు మంత్రిబోధనలను బెడచెవినిబెట్టెను.

త్వరలో సుల్తాను సభామందిరము తెఱవబడు సమయమయ్యెను. అలాఉద్దీను తల్లి నూతనామూల్యాంబరములు ధరించి పరిచారికా సమేతయై సుల్తానుకోటలోనికిబోయి. నేటిసాయంకాలము రాజకుమార్తెను నిజభవనమునకు గొంపోవ ననుజ్ఞ గైకొని వచ్చెను. అలాఉద్దీను తన యశ్వరాజము నధిరోహించి సపరివారముగా కడచిననాటి వైభవముతో తనమేడలోని కరిగెను. మంగళవాద్యములు వివిధ మధురవాద్యములు మ్రోవసాగెను. ఆమంగళారావముల మాధుర్యమునకు నిదురలులేచి, పెరకార్యములను వదలివేసి నాకవాసులు సైతము చెవియొగ్గి యాలకించిరి. ఇట్లు అలాఉద్దీను తన పితృయగృహమును విడిచి నూతన నిర్మిత రత్నసౌధములో బ్రవేశించెను.

అలాఉద్దీనుతల్లి,యాసమయమున దిరిగి సుల్తాను భవనముననున్న బుద్దీరుల్ బుద్దూరు నొద్దకు బోయినది. సుల్తాను ఆమెకు గొప్పవిందునేర్పాటుసేయించి బంధుమిత్రులగుస్త్రీల లోగూర్చుండబెట్టి గౌరవముచేయించెను. పదంపడి యామె యిష్టానుసారము రాజకుమార్తెను నిజభవనమునకు జేర

సిద్ధపరచిరి. నూరుమంది సేవకులు మోయు వాహనము నలంకరించిరి. అంతకుమున్నే అలాఉద్దీను పంపిన రత్నాభరణముల నన్నింటిని యామెమేన నలంకరించిరి. సుల్తాను తన ముద్దుకుమార్తె యత్తవారి యింటికి బోవుచున్న దగుటచే పెద్దప్రొద్దుదనుక నంతఃపురమందిరముననే యుండెను. మహారాజ్ఞివోలె విలసిల్లుచున్న అలాఉద్దీను తల్లి, మేలిముసుంగు పూర్ణముగా దీయక సుల్తానుతోసగౌరవముగా తగు ప్రసంగము సేసెను. సుల్తాను ఆమెశీలమును రాజ్ఞీ సమర్హములగు లక్షణములను గమనించి, మిక్కిలి సంతోషించెను. నిజజనని నట్టి మర్యాదలోనుంచి నందులకు అలాఉద్దీను ఔదార్యమును, విజ్ఞానమును గొనియాడదగినదని సుల్తాను ప్రసంగించెను.

రాత్రి కొంత ప్రొద్దయిన తరువాత, బుద్దీరుల్ బుద్దూరు తన తండ్రియొద్ద సెలవుదీసికొని బయలుదేర మహారాజ్ఞి, కుమార్తె లెడమప్రక్కనడువ, అత్తగారు ముందడుగువైవ, నాలుగునూర్లమంది పరిచారికాగణము చుట్టును శుభ ద్రవ్యభాజనములతో బయలుదేర, కోట్లనాణెముల విలువసేయు రత్నఘటితములైన సామానులను నూర్ల సేవకులు శీర్షముల నుంచుకొని, ముందు నడయాడ, మహామధుర మంగళవాద్యములు కర్ణపేయములుగా మ్రోయ, అలాఉదీను భవనమునందలి మణిదీప కాంతులును, సుల్తాను సౌధమునగల మణిదీపకాంతులును, నేకమయి

ఆనాటిరాత్రిని బగలుగా మార్చినవి. రాచకన్యక పెండ్లి కూతురై అలాఉద్దీను సౌధప్రాంగణమునకు బోయెను.

అలాఉద్దీను సంతోషముతో ద్వారముఖమున నిల్చి రాజకన్యక నాహ్వానించెను. తల్లి కుమారుని ప్రక్కనుండి పలుమంది యుద్యోగీయుల మధ్యనున్న యతని వ్యక్తిని



జూపి, నీభర్త యితడే నని చూపెను. అలాఉద్దీను ఆమెచేయిపట్టుకొని పెద్దహాలులోనికి దీసికొనిపోయి ఉచితాసనమువై గూర్చుండ బెట్టెను. అసురుని సాయమువల్ల నదివఱకే యందు బల్లలపై వివిధభోజ్య పదార్థములతో విందు సిద్ధముచేసి యుంచెను. విందునారగించుచు దంపతులు ప్రసంగించు నప్పుడు బుద్దీరు తనతండ్రియాజ్ఞను శిరసావహించుచు "మీకు నేను విధేయురాలను మీయందు నాకేసంశయమును లేదని చెప్పు నవకాశము కలిగినందులకే సంతసించు చున్నా" నని భాషించెను. సౌధరాజముయొక్క శోభకు ఆమె

యెంతయు నానందించెను. తరువాత అలాఉద్దీను ఆమెను లోనికి గొంపోయి ఆమెకొఱకు నియమింపబడిన స్థానమున గూర్చుండబెట్టి, ఆమె ప్రక్క తనతల్లిని గూర్చుండబెట్టెను. వాద్య విశేషముల సాయముతో, సుందరస్త్రీలు గాయనముల బాడిరి. నర్తకాంగనలు అంతనాట్యము సేసిరి. సాయంత్ర మైనందున భోజనము పూర్తిచేయించి, పెండ్లి కుమారునితల్లి పెండ్లికూతురును శోభనాలయములోని కంపించెను. ఆనాటిరాత్రి యానూతనదంపతులు సంశయ రహితముగా నన్యోన్యానురాగముతో మదన సామ్రాజ్య మహాసౌఖ్యము లనుభవించిరి,

మరునాడు అలాఉద్దీను దుస్తులను మార్చుకొని సుల్తాను సభకేగి రాచనగరి వారినెల్లరను విందారగింప నాహ్వానించెను. సుల్తాను సపరివారముగా వచ్చి కుమార్తె యింటివద్ద విందారగించి సంతసించెను.

వివాహానంతరము అలాఉద్దీను అప్పుడప్పుడు నగరములోని మజీదులకు ప్రార్దనకు వెళ్లుచుండెడువాడు. గుఱ్ఱముమీద నెక్కిపోవునప్పుడు తనముందు ఇద్దరు సేవకులను నియమించి వారిచేత బంగారు నాణెములను ప్రజలకొఱకు ధర్మార్థము చల్లించుచుండెడివాడు. అప్పుడప్పుడు వేటకు బోవుచుండెడివాడు. వేటకై నగరమును విడిచి పల్లెలమధ్యగా పోవునప్పుడు బంగారు నాణెములను జల్లించుచుండుట వలన గ్రామాదులలోని ప్రజలకు నితనిపై అభి

మానము గలుగుచుండెను. క్రమక్రమముగా ప్రజలు సుల్తానునెడకంటె నలాఉద్దీను నెడ నధికానురాగము జూప జొచ్చిరి. ఒకప్పుడు ప్రజలు సుల్తానుపై తిరుగుబాటు సేసి నప్పుడు అలాఉద్దీను సేనానాయకుడై దుండగీండ్ర పీచ మడంచి సుల్తానునకు అధికానురాగ పాత్రుడయ్యెను.

అలాఉద్దీనిట్లు రాజభోగము లనుభవించుచుండగా నక్కడ ఆఫ్రికాదేశములో తొలుతటి మాంత్రికుడు తన మామూలు మాంత్రిక ప్రయత్నములు జరుపు సమయమున నతని మనస్సునకు దాను మున్నొనరించిన కష్టము కొంత వ్యర్థమయ్యెనుగదాయని విచార ముదయించెను. ఆసందర్భ మున దాను గుహలోనుండజేసి వచ్చిన అలాఉద్దీను అచ్చట మ్రగ్గెనా లేక బ్రతికియుండెనా యను సందియము వొడ మెను. అతడు భూగర్భశాస్త్రజ్ఞుడగుటచే నీవిషయము తన వద్దనున్న యంత్రమున చూడగా అలాఉద్దీను బ్రతికియు న్నట్లును ఫలితము దేలెను.

మాంత్రికుడా ఫలితము దేలగనే యొడలెరుంగని ఆగ్రహము నొందెను. ఎట్లయినను నతనిని పరాభవింప వలెనని నిశ్చయించుకొని, యొక సాధారణ తురంగము నధివసించి, పయనముసేయుచు, నందందు మకాముచేసి విశ్రాంతి జెందుచు, మహాప్రయాసచే చైనాదేశమునకు జేరెను. క్రమముగ రాచనగరమునకుబోయి యొక ధర్మ శాలలో బసచేసెను. అచ్చట ఒకటి రెండు దినములు నిలిచి

ఆయూరిలోని సమాచారములు దెలిసికొను చుండెను. ఒక్క నాడతడొక హోటలులోనికిబోయెను. అచ్చట పిన్న పెద్ద లందఱు దినదినము పానీయము ద్రావుచుండిరి. ఆయాసమ యములందు వారు సంభాషించుకొనువేళ నాసంభాషణ ములో పాల్గొనెను. వారు అలాఉద్దీను నొక యువరాజుగా మాట్లాడుకొను చుండిరి. ఆతని సౌధము సుల్తాను సౌధము కంటె నధిక రామణీయకముతోనున్నదనుకొనిరి. "అయ్యో! అలాగా! ఆమేడను నేనుజూడనైతిని. అది యెచ్చటనున్న దని మాంత్రికుడు ప్రశ్నించెను. అచ్చటి యువకులలో నొకడు "జూపెదనురమ్మని. ఆమాంత్రికుని నలాఉద్దీను సౌధము దగ్గిరకు గొంపోయి దాని సౌందర్యము జూపెను. ఆఫ్రికామాంత్రికుడు అది అలాఉద్దీను సౌధమని వినుటలో, నతని పూర్వవృత్తాంత మెరింగినవాడగుటచే నింతకాల ములో నిట్టి మాణిక్యభవనము నిర్మించు నంతటి భాగ్యము విచిత్ర దీపికాపాత్రముయొక్క ప్రసాదముగాని వేఱొండు గాదని నిర్ణయించుకొనెను. మఱియు భవన నిర్మాణ చాతు ర్య మమానుష్య కృత్యముగా విశదమగుచుండెను. ఈకార ణము వలనను జనుల ఆశ్చర్యపాటుల వలనను అలాఉ ద్దీను జీవించివచ్చి విచిత్ర దీపపాత్రము తనయొద్ద నుంచు కొని, కష్టసార ఫలితము ననుభవించు చున్నాడని యీర్ష్యా జనిత మహాగ్రహావేశము చెలరేగ ఈతనికడ నా దీపపాత్ర ముసంగ్రహించునుపాయము నాలోచింపజొచ్చెను.

ఆఫ్రికా మాంత్రికుడున్న ధర్మశాల సమీపమున నొక హోటలుండెను. పురజనులు పెక్కురక్కడికివచ్చి ప్రసంగములు జేయుచుండిరి. అలాఉద్దీను విషయమై అతని పరిసంగము విషయమై ప్రసంగము వచ్చినప్పుడు మాంత్రికుడు నాకతనిదర్శనము కాగలదాయని యడిగెను. అంత నొకసభ్యుడు "కాగలదు, అతడు రెండు దినముల క్రిందట వేటకై యడవిప్రాంతమునకు బోయెను. అది ఎనిమిది దినముల ప్రయాణమనిచెప్పెను. మీరింక నైదు దిన ములవరకు నాగితిరేని యతనిని మీరు చూడగలుగుదురని సత్యము తెలిసినంతవరకు జెప్పెను.

ఈవార్త మాంత్రికుని చెవిని బడినతోడనే యతడు ధర్మశాలాధికారి దగ్గరకుబోయి తానింక బ్రయాణముసేతు నని సెలవుదీసికొనెను. బయటికిబోయి యొక బీదవ్యాపా రస్తుని దుస్తులను సిద్ధము సేసికొని, లాంపులను దయారు చేయు నంగడి యొద్దకుబోయి "నాకు పండ్రెండు లాం పులు కావలయును. అవి రాగితో జేయబడవలయును. నీ కేమి కావలయు"నని యడిగెను. ఆయంగడిదారు తనయొద్ద నున్న వాటిని మాత్రమిచ్చి శేషించిన వాటిని మఱునాడిచ్చు టకు నొప్పుకొని మొత్తము వెల ధనము మాంత్రికుని వద్ద నుండి తీసికొనెను. ఆనాటిరాత్రి యతడొక పెద్దబుట్టనుకొని ఆలాంపుల నందులోనిమిడ్చి యుంచెను. మఱునాటి యుద యమున దిరిగి యాయంగడివానియొద్ద రావలసిన లాంపు

లను గూడ తీసికొని మొత్తము పండ్రెండుసేసి లాంపుల వర్తకుని వేషమువేసి యాబుట్టను మోసికొనుచు నలాఉద్దీను



మేడవీధికి బోయెను. పాతలాంపులు ఇచ్చిన యెడల క్రొత్త లాంపులు ఇయ్యగలను. కావలసినవారు తీసికొనండి యని ఒకటి రెండుసార్లు కేకవైచెను. ఆవీధిబాలురెల్లరు నతనినొక పిచ్చివానిగా పరిగణించి వెంబడించిరి. బాలకు లాతనిని పరిహాసింప సాగిరి. వారందరు తన వెంటనంటి యెంత గేలి చేయుచున్నను లెక్కసేయక యతడా చింపిరి గుడ్డలతో అలాఉద్దీను సౌధముక్రింద నిల్చి పాతలాంపులకు క్రొత్తలాంపులోయని రెండుమూడు పర్యాయములు కేకలు వైచెను.

అలాఉద్దీను ప్రతి సమయమునకు ల్యాంపును దన యొద్దనే యుంచుకొను చుండెడివాడు. కాని వేటకు బోవునప్పుడు దానిని వద్దనుంచుకొని మెసలుటకు వీలులేనందున, తన దుస్తులగదిలోని బీరువామీదబెట్టి వేటకుదరలిపోయెను.

ఆ ల్యాంపు ప్రభావము ఆయింటిలో నెవ్వరికిని అతడుచెప్పి యుండలేదు. రహస్యపదార్థమును, గౌరవమూలమునునగు వస్తువగుటచే భార్యకైనను జెప్పియుండలేదు. అందువలన నొకగూటిలో పడియున్న ఆ విచిత్రదీపపాత్రి నొక పాత ల్యాంపనుదృష్టితో నాతనిభార్య వీక్షించుచుండెడిది. బజా రులో రెండుమూడు పర్యాయము లొక కేక వినఁబడుటచే నది యేమో కనుగొనిరమ్మని తనయొద్దనుండు నొక పరి చారిక నంపెను. ఆమె క్రిందికిపోయి యావర్తకు సడుగగా నతడు పాతల్యాంపులకు క్రొత్తరాగిలాంపుల నిచ్చువాడనని యాతడు బదులుచెప్పెను. అప్పుడామె మాయింట నొక పాతల్యాంపు ఉన్నది. వ్యర్థముగా బడియున్నది దానిని తీసి కొని క్రొత్తల్యాంపు నిచ్చెదవాయని యాపరిచారిక మాయా వర్తకుని ప్రశ్నించెను." "ఇచ్చెదను నేను త్వరగాబోవు చున్నాను. వెంటనే మీవస్తువును దీసికొనిరండని చెప్పెను." అంత నాపరిచారిక రాణియొద్దకు బరుగిడిపోయి "అతడు పాతల్యాంపులను దీసికొని క్రొత్తల్యాంపుల నిచ్చువాడు" అనిచెప్పెను. అట్లయిన మనయొద్దనున్న పాతల్యాంపువ్యర్థ ముగా బడియున్నది. దానినిచ్చి క్రొత్తల్యాంపును దీసికొని రమ్మని విచిత్రదీపపాత్రమును దీసి పరిచారిక చేతికిచ్చెను. పరిచారికయు దీనినిచ్చుట నెవ్వరు పెట్టియుండిరనిగాని, ఇది యిందు జాగ్రతచేయఁబడి యుండుటకు కారణమేమనిగాని యిసుమంతయు నాలోచనసేయక, ఒక్కపరువున సరాసరి

యీ విచిత్ర దీపపాత్రను సామాన్యపు ల్యాంపుగా భావించి దానికిబదులు క్రొత్త లాంతరును దీసికొనుట లాభకరమని



యెంచి వర్తకుని దగ్గరకుబోయి క్రొత్తల్యాంపును దీసికొని యా విచిత్రదీపపాత్ర నిచ్చివేసెను. అతడు దానిని దీసికొని తన బుట్టలో జాగ్రత్తగా నుంచుకొని, బాలుర పరిహాసములకు గేరింతలకు లెక్క సేయక, బిరబిర వీధిదాటెను. అచ్చటనుండి శబ్దముసేయక మెల్లగనూరిబైటికిపోయి బరువు తగ్గించుకొని, వేషము మార్చుకొని యంతకంతకు దవ్వుదవ్వునకేగెను.

చిరకాలమునుండి విచిత్ర దీపపాత్రకై ఆ మాంత్రికుడు చేసిన శ్రమయును, వెచ్చబెట్టిన ద్రవ్యమును నాటికి సార్థకరించినవి. అలాఉద్దీను తన్ను మోసగించెనను భావము మహాకోపాన లానుగతమై యతని మానసము నేర్చుచున్నది. అప్పుడొక చాటు చోటి మైదానమున స్థిమితముగా గూరుచుండి దీపపాత్రపై నొరపిడిచేసి రాక్షసుని బిలిచెను.

తోడ్తోన రాక్షసుడు ప్రత్యక్షమై "నీకేమి గావలయును. నేను నీకును ఈదీపపాత్ర స్వాధీనములో నుంచుకొను వారి కెల్ల రకును దాసుడను. నే నొక్కడనేగాక, యీ దీపపాత్రకు దాసులైన రాక్షసు లెల్లరును నీకు దాసులై నీయాజ్ఞ నిర్వహింపగలరు. ఆనతిమ్మని గంభీరస్వరముతోఁబల్కెను. "ఓయీ రాక్షసరాజా! ఈరాచనగరములో నలాఉద్దీనుకొరకు నీవు కట్టియిచ్చిన మాణిక్యసౌధమును అందలి పరిజనముతో గూడ నాజన్మభూమియగు నాఫ్రికాదేశములో నాయింటి తావున నుండునట్లుగా మార్పుసేయుము." అని మాంత్రికు డాజ్ఞాపించుచు, దననుగూడ శీఘ్రముగ నచ్చటికి జేర్చుకొను



మని కోరెను. అందుల కసురుడు చిత్తమని కను మూసి కను దెఱచినంత కాలములో నా యాఫ్రికా మాంత్రికుని, సుల్తాను కుమార్తెయగు రాజ్ఞితో డను, సర్వపరిజనముల తోడను. నలాఉద్దీను మాణిక్య సౌధరాజమును ఆఫ్రికాదేశమున మాంత్రి కుని యింటి తావునకు మోసికొనిపోయి స్థాపన

సేసెను. మాంత్రికుననుజ్ఞ దీసికొని యంత నా రాక్షసు డదృశ్యుడయ్యెను.

మఱునాటియుదయమున సుల్తానునిదురలేచి యతని ప్రత్యేకాలయములోనికి బోయి, రివాజుప్రకారము బుద్ధీరు మాణిక్య భవనము వంకజూచెను, అక్కటా! అచ్చట నవరత్న ప్రభాజాలముతో మహాకాంతుల వెదజల్లుచుండెడు మాణిక్యభవనము సంపూర్ణముగా నదృశ్యమయ్యెను. ఇక సాధగవాక్షములోనుండు మందహాసముతో తొంగిచూచు ముద్దులకుమార్తె మొగమెట్లు కనబడును? సుల్తాను కొంత తడవు వణకు దనకన్నులను దానేనమ్మలేకపోయెను. రెండు పర్యాయములు కన్నులు నలుపుకొని అలాఉద్దీను భవనమునుండిన ప్రాంతమువంక జూచెను. కాని ఎంత చూచినను నాప్రదేశమంతయు శూన్యప్రదేశముగనే యగపడెను. అంత సేవకులెల్లరు తేఱిపాఱజూచిరి. అమాంతము భవనమంతయు నిశ్శేషముగా మాయమయ్యెను. సుల్తాను సవిషాదముగ సభాభవనమునకుబోయి వజీరురాక కెదురుచూచెను. అంతలో వజీరు కార్యాలయమునకు వచ్చెను. తొలుదొల్త సుల్తాను వజీరుతో "అలాఉద్దీను మాణిక్యభవనము అదృశ్యమయ్యెనని వింటివా" యనెను. వజీరు "అదెట్లగును? అంతటి సువర్ణ మాణిక్యములతో నంత దృఢముగా నిర్మించబడిన మహాసాధము ఒక్కదినములో నామరూపములు లేక యదృశ్యమాయె నన్నచో నామానసము

నమ్ముటలేదనెను. అట్లయినచో నీవు నా ప్రత్యేకాలయము లోనికిబోయి చూచిరమ్మని సుల్తాను వజీరును ప్రోత్సహించెను. తక్షణమే వజీరు "చిత్తము ప్రభూ!" అనిలేచి రాజరాజు, ప్రత్యేకమందిరములోనికి బోయెను. కన్నులువిప్పి అలాఉద్దీను భవనముగల ప్రదేశము వంకజూడగా నచ్చట నేమియు లేకుండెను. తిరిగి యతడు సుల్తాను వద్దికివచ్చి "రాజా! తమరు చెప్పినది సత్యము అంతయు వింతగా నున్నది. అతడు మోసగాడని నేను జెప్పుచునే యుంటిని. అక్షరాల నేను చెప్పినదంతయు జరిగినది. అతడు వారము దినములనుండి పేటనెపమున నెందో పాఱిపోయి తమదర్శనమునకే వచ్చుటలేదు. వెంటనే యొక యాశ్వికుని నతడు పోయినమార్గమున బంపుడు. అతడు కనబడిన తావుననే యతనికి సంకెలువేసి పట్టుకొని తెచ్చుట కాజ్ఞయొసంగుడు. భవనమేమైనదో రాజకుమార్తె యేమైనదో పరివార మేమైనదో అన్నియు నతడే చెప్పగలడనెను. "సుల్తాను సంభ్రమముతో "అతడు మరలి వచ్చునప్పుడు పట్టుకొని సంకెళ్ళతో బంధించి నాయొద్దకు దీసికొని రావలయునని శాసించియొక సేనాసమితిని అలాఉద్దీను రానగుత్రోవ కెదురుగా బంపెను. వెంటనే సేన బయలుదేరెను. నాలుగుమైళ్ళదూరమున వారికి నతడు గానవచ్చెను. సేనాసమితి యాతని ద్వారగా రావలయునని రాజాజ్ఞ అయ్యినదనిచెప్పి నగరమునకు అరమైలు దూరమువఱకు రప్పించిరి. యచ్చట సైనికులెల్లరు నతని

చుట్టు నావరించి "మిమ్ము నిర్బంధించి పట్టితెచ్చుటకు రాజాజ్ఞయైనదని తెల్పిరి. అలాఉద్దీనువెంట గొద్దిమంది యనుచరులు మాత్రముండుటచే జేయునదిలేక తలవంచెను. సేనానాయకుడు అతనిని గొలుసులతో చేతులకును మెడకును గట్టి, గొలుసు కొన దనకేలనుంచుకొని వీధులవెంట నడపించుకొనుచు నగరిముందుకు దీసికొనిపోయెను. అలాఉద్దీను భవనముననుండు సేవకులకు దెలియనీయలేదు. వాని యనుచరు లెవ్వరైన వచ్చి యడ్డగింతురేమోయని, యతడు కోటలో నడుగు పెట్టగనే సింహద్వారము తలుపులుమూయబడెను. వధారంగమున సుల్తాను వజీర్లముందు నలాఉద్దీను గొంపోబడెను. "తుది సంజ్ఞతో అలాఉద్దీను తలదీసివేయు"డని హంతకులకు రాజాజ్ఞయయ్యెను. హంతకుడు కత్తిదూసి అలాఉద్దీను గొలుసుల నూడదీసి, నేరస్తులను జంపునపుడు వేయు నెత్తురుబట్టను నేలబరచి, దానిపై నలాఉద్దీనును వంగబెట్టి, కన్నులకు గుడ్డగట్టి ముమ్మారా ఖడ్గమును గాలిలో దిప్పుచు సుల్తాను తుదిసంజ్ఞ కొఱకు నిలిచియుండెను.

ఆసమయమున వేనవేలు ప్రజలు కోటగోడలపైనెక్కి గోడరాళ్ళను బెటికివేయసాగిరి. రక్షకాశ్వికసేనను దాటి కోటవాకిట వేలప్రజలు గుమిగూడిరి. వధారంగమునకు పెక్కుజనులు జేరిరి. అలాఉద్దీను వధతో గోటయంతయు ప్రజలచే సర్వనాశనము సేయబడనున్నట్లు వజీరుగ్రహిం

చెను. ఆతరుణమున వజీరు సుల్తానుతో "ప్రభూ ! వధా సంజ్ఞ చేయకముందే తమ క్రియాఫలితము నాలోచించుడు. మొత్తము కోటకే యపాయము కలుగునేమో యోచించుడు" అనిచెప్పెను. నాకోటపై కెవ్వరు సాహసింతురని సుల్తాను సగర్వముగా బల్కెను. మీదృష్టిని కోటగోడలమీదికిని పెద్ద మైదానము మీదికిని బ్రసరింపజేసి ప్రజలయలజడిని చూడు డని వజీరు మనవిచేసెను. సుల్తాను ప్రజాసంఘముల యా గ్రహచర్యలను జూచి చాలభీతిల్లి "ఖడ్గమును వరలోపెట్టు మని హంతకునకు ఆజ్ఞయొసంగెను." అలాఉద్దీను క్షమింప బడి విడుదల చేయబడెనని ప్రకటన జేయించెను. ప్రజలు శాంతించి తమ చేయదలచిన ఘోరకృత్యములను విరమించి, యల్ల నల్లన జెదరిపోయిరి.

విముక్తుడైన అలాఉద్దీను సుల్తాను ముందుకుబోయి ప్రభూ ! నాతప్పేమని యడిగెను. దుర్మార్గుడా నీతప్పు నీకు జూపెదను రమ్మని అలాఉద్దీనును దన ప్రత్యేక రంగము లోనికి దీసికొనిపోయి "నీభవనమేమయ్యెనని యడిగెను. శూన్యప్రదేశమునుగాంచిన అలాఉద్దీను చిత్తమున నాశ్చర్య సంభ్రమములు పెనగొనెను. సుల్తాను ప్రశ్నకు బ్రత్యుత్తరము చెప్పుట కతనినోటి నుండి యొకశబ్దమైన వెలువడ జాలక పోయెను.

"నీమేడయేమైనది ? నాకుమాత్రె యేమైన"దని సుల్తాను అలాఉద్దీనును రెండవసారి ప్రశ్నించెను. అతడు

నాకేమియు బోధ పడుటలేదు, కాని యీ యకార్యకారణ ములో నాకేమియు సంబంధము లేదు అనిజవాబుచెప్పెను. అంత సుల్తాను నీమేడ యేమైనగానిమ్ము. అంతకు వేయి విలువగల నాకుమార్తె క్షేమమును దెలుపుము. లేనియెడల తిరిగి నీకు శిరచ్ఛేదశిక్ష నొసంగెద నని శాసనపూర్వకముగా బల్కెను. అలాఉద్దీను ఆవిషయముల గురించి విచారించు టకు నలుబదిరోజుల వ్యవధియొసంగవలయుననియు వ్యవధి కాలములో శుభవార్త చెప్పనియెడల తాను శిరచ్ఛేద మున కంగీకరింతుననియు బ్రసంగించెను. ఇందుకు దప్పితి వేని యప్పుడు నీవు సర్వప్రపంచమున నేమూల దాగికొని నను, నిన్ను బట్టితెప్పించి శిరచ్ఛేదము జేయించెదననిపల్కి సుల్తాను అలాఉద్దీనుకు సెలవొసంగెను.

అంత నలాఉద్దీను తలవంచుకొని కనులెత్తి యెవ్వరి వంకను జూడక విచారాభిమానములతో గోటదాటెను. నగ రములో నెవ్వరికైన నేమైన తెలియునాయని యెందఱినో యడిగెను. అతని మేడసంగతిగాని భార్యసంగతిగాని యెవ్వ రును జెప్పియుండలేదు. రెండవనాడు నగరమువిడిచి చాల దవ్వునకు బోయి యడవిలోని కాలిత్రోవ బట్టుకొని సూటిగా ప్రయాణము సేయుచుండెను. బాటలోనొక జలప్రవాహ మగపడెను. దానియొడ్డున నిల్చి కొంచెము యోచించి నా నిష్ఫల ప్రయత్నముతో నేమియు లాభములేదు తిరిగి శిక్షావ మానము పొందుటకంటె నీప్రవాహమున బడి ప్రాణముల

విడుచుటయే మేలు అని వితర్కించుకొని దైవప్రార్థనము జేసి యాదొనలో మునుకుటకు సిద్ధపడి నీటిలోనికిబోగా కాలుజారి క్రిందనున్న రాతిపైబడెను. అదృష్టవశమున నతనికి దొలుత గుహాముఖమునుండి వెలువడుటకు కారణ మైన వేలియుంగరము అచ్చటిరాతికి రాచుకొని ఒరపిడి పొందెను. ఆక్షణముననే యాయుంగరమునకు దాసుడైన రాక్షసుడొక్కడు అతనికి గానవచ్చెను. "అయ్యా నన్నేల పిలచితివి. నేను ఈ యుంగరము స్వాధీనమునం దుంచు కొను వారికెల్లరకును దాసుడను నీకేమి కావలయునోచెప్పు మనెను. అంత నతడు నీవు నన్నొకసారి విపత్తునుండి రక్షించితివి. ఇది నా రెండవవిపత్తు. నేను కట్టించిన రత్న సౌధమున నిల్పుము. లేదా నాసౌధమునే నాపూర్వస్థానము నకు దెప్పింపుమని వేడెను. కాని దీపికాపాత్రముచే జేయ బడినదానిని మరల్చుటకు నావశముగాదని యసురుడు వా కుర్చెను. మఱియు నలాఉద్దీను అయినచో ఆరత్నసౌధము ఇప్పు దేయరణ్యములోనున్నను నన్నచ్చటికి గొంపోయి నాభార్యయున్న మందిరము కిటికీక్రింద నన్ను విడిచిపెట్టు మని యాజ్ఞాపించుచున్నాననెను. నిమిషమాత్రమున రాక్షి సుడు ఆఫ్రికాదేశములో నొక నగరమునకు వెలుపలగా నున్న యారత్న సౌధములో నతనిభార్య గదికిటికీకి క్రింది భాగమునకు దీసికొనిపోయి విడిచి యదృశ్యుడయ్యెను. ఆరాత్రి కటికి చీకటిలో దన సౌధమును గుర్తించి అచ్చటికి

దగు దూరమున నున్న యొక మహావృక్షము క్రింద గూర్చుండెను. ధైర్యము దెచ్చుకొని కొంతవడికి నిదుర చెందెను.

ఉదయమున నిదురమేల్కాంచి దీపికాపాత్ర నశ్రద్ధ చేయుటవలన నీదౌర్భాగ్యము పైబడెనని గ్రహించి కర్తవ్యము నూహించుచు బుద్దీరుల్ బుద్దూరు మేడకిటికీ క్రింద వీధిలో దిరుగాడు చుండెను. బుద్దీర్దు ఉదయముననే నిద్రి వెలుతురు కొఱకు కిటికీతలుపులు తెరచునప్పటి కామెకు తన హృదయేశ్వరుని మొగము గనబడెను. కిటికి తలుపు చప్పుడువిని అలాఉద్దీను పైకి జూడగా నతని కామె మొగమును గనబడెను. బుదీరు అలాఉద్దీనుల హృదయ రంగముల యందు పునస్సాఖ్యాశాలతలు యిగురుపెట్టినవి. బుద్దీరును దొడ్డిద్వారము గుండ లోనికి రమ్మని భర్తకు సంజ్ఞ చేసి తలుపు దెరపించినది. అతిశీఘ్రమున నలాఉద్దీను లోనికి బోయెను. దంపతులొక్కచోట గూరుచుండి ప్రేమాలింగనముల జేసికొని కన్నీరుగార్చి జరిగిన వృత్తాంతములు చెప్పుకొనసాగిరి. తాను వేటకు బోవునప్పుడు తనదుస్తుల గదిలో బీరువామీద పెట్టిన పాత దీపికాపాత్ర నేమిచేసితివని అలాఉద్దీనామెనడిగెను ఆరాజకుమారి తాను తప్పుచేసితినని తెలిసికొని పాతలాంపును మాయవర్తకున కిచ్చిన విధానమును వివరముగా దెలిపెను. ఆవర్తకు డదృశ్యమైన యొక యరగంట లోపల నీ సౌధము ఈ యజ్ఞాతప్రాంతమునకు

దేబ్బడెననెను. పదంపడి మఱియొకసారి "యిపుడుమనమున్న దేశము ఆఫ్రికాయని యామోసగాడే చెప్పెననియు వాక్రు చ్చెను. ఆమాటతో తొలుత పినతండ్రినని చెప్పి తన్ను మోసగించిన ఆఫ్రికామాంత్రికుడే యీముప్పు దెచ్చిపెట్టెనని గ్రహించి ఆపాతలాంపు నత డిప్పుడెక్కడ పెట్టెనని అలా ఉద్దీను తనభార్యనడిగెను. ఒకప్పు డాతడు సంతోష సమ యమున దన ఎదురురొమ్ముపై దుస్తులనుండి లాగి నాకు జూపించి నందువల్ల, వనయొద్దనే భద్రముగ రొమ్మున గట్టుకొన కాపాడుచున్నవాడని గట్టిగాఁ జెప్పగలననియామె అలాఉద్దీనుకు దెలిపెను.

ఆ సంకుచిత సమయముననే అలాఉద్దీను "ఆమోస గాడు నీయెడ నేవిధముగా బ్రవర్తించుచుండెనని మఱియొక ప్రశ్ననడిగెను. "అతడు దినమునకొక్కసారి, నన్ను జూడ వచ్చి నా పాతివ్రత్య శీలమును మఱలించుటకు బెక్కురీ తుల ప్రసంగించి పోవుచుండును. కొంతకాలము వరకు నేనొడంబడకున్నచో నన్ను బలత్కారముగా చేబట్టవలయు నని యతని యుద్దేశము. మధ్యమధ్య నీభర్త నీతండ్రిచే శిరచ్ఛేదము చేయబడెనని యుగ్గడించుచుండెడివాడు. ఇపుడు నీదర్శనమువలన నాభయములన్నియు తీరిన"వని బుద్దీరుల్ బుద్దూరు అలాఉద్దీనుకు జెప్పెను.

నీభయములు వెనుకబట్టినవి గనుక ఇకనేను వానిని శిక్షించుటకు జేయు ప్రయత్నములు వ్యర్థములుకావు. నా

కొాక పన్నుగడ యున్నది. నేనీదుస్తులను మార్చుకొొందును. మధ్యాహ్నము తిరిగివచ్చెదను. అప్పుడు నీవుచేయవలసిన క_ర్తవ్యమును జెప్పెదను. నేనువచ్చినప్పుడు నన్ను గు_ర్తించి తలుపుపై నొకదెబ్బ కొట్టినవెంటనే తలుపుతెఱవవలయునన చెప్పి అట్లొనరించుట కామెచేసిన వాగ్దానమువిని, అలాఉ ద్దీను భవనము విడిపోయెను. ఒక వ్యవసాయదారుడు తనకు ముందు తోవనరుగుటంజూచెను. త్వరత్వరగా నాలుగడు గులు ముందువైచి యతనిని గలిసికొని నాబట్టలను నీకిచ్చె దను నీబట్టలను నాకిచ్చెదవాయని యడిగెను. అతడందు లకు సమ్మతింప, దనవస్త్రముల నతనికిచ్చి యతనివస్త్రము లను దానుదీసికొని, తానొక కృషీవలునివలె వేషధారియ య్యెఁ. అచ్చటనుండి పెద్దబజారునగల యొక మందుల యంగడికిబోయి ఒక పొడిపేరుజెప్పి దానికి దగినవెలనిచ్చి సంగ్రహించెను.

ఆప్రాంతమున గనబడిన యొక కాఫీహోటలుకు బోయి కొన్ని పదార్థముల భుజించి పానీయముద్రావి, యాకలినడంచుకొని, బిరబిర రాజకుమారి సౌధమునకువచ్చి వెంటనే తెఱువబడిన దొడ్డిగుమ్మముగుండా తన యర్థాంగి యరలోజేరెను. అప్పుడతడామెను సంబోధించి, "రాజకు మారీ మన భావిజీవిత సౌఖ్యము నేనుజెప్పబోవు కార్యక్ర మము యొక్క విజయముపై నాధారపడియుండును. నేడా మాయావి వచ్చినప్పుడు నీవు మిక్కిలి సంతోషముగా

నున్నట్లు నటించుము. మంచిదుస్తులను వైచికొని మనో రంజకమైన ప్రసంగము సేయుము. నన్ను కేవలము మఱచి నట్లును నామాట వచ్చినప్పుడు అసహ్యించుకొనునట్లును నటించుము. నేటితో నతనికి వశపడుదానివలె భాషించుము. ఈదేశపు సారాయి ద్రావ నిచ్ఛయైనట్లును దానినతడు తెప్పింపవలయు ననియు జెప్పుము. నేటిరాత్రి భోజనమున కాహ్వానింపుము. నేనిప్పుడు నీకిచ్చుచున్న యీపొడి నొక సారాయి గిన్నెలో కలిపి దానిని ప్రత్యేకముగా సిద్ధముంచి నీవు పిల్చినప్పుడు తెచ్చియిచ్చునట్లు నీపరిచారికలలో నొక దానికిజెప్పియుంచుము. మీరుభయులు భుజించి త్రావినవెనుక అతనిచేతి సారాగిన్నెను నీవును నీచేతి సారాగిన్నెనునతఁ డును ద్రావి యన్యోన్యప్రేమమును స్థిరపరచుకొన వలయు నని యభిలషించు చున్నట్లు నటింపుము ఈ ప్రక్రియ నత డొక గౌరవనీయాంశముగా భావించుచు సంతోషముతో సమ్మతించును. ఇట్టి పొడినిగలిపిన సారాయి నతడు ద్రావ గనే వెనుకకు బడిపోవును. అట్టి తరుణమున దటాలున లోపలికి వచ్చుటకు నేను సౌధసమీపమున గాచియుండెద ననిబోధించి యా చూర్ణము నామెచేతికొసంగి, యామెవలన సమాధాన వాక్యమువిని మేడదిగిపోయెను. ఆపయిననతఁడు పొద్దుగుంకుదనుక నాసమీప ప్రాంతములలోదిరిగి కొంచెము రాత్రి యగువఱకు, తగురీతి తటాలున మేడలో బ్రవేశింప వీలొసంగునంతటి దూరమున మాత్రము కాచుకొని యుండెను.

బుడ్డీరుల్ బుద్దూరు నాడు మాంత్రికుడు వచ్చు సమయమువఱకు దనకుగల యమూల్యాంబరములలో మేలిరకము చీరె ధరించెను. తన రత్నభూషణము లన్నిటిని ధరించి, తగురీతి నద్దములోజూచి దిద్దుకొనెను. నాటి యామె యలంకారము జూచినవారు మహారాజాధిరాజుల మహారాజ్ఞులనే పరిచారికలుగా నుంచుకొన దగిన సౌభాగ్యము గలిగి-యున్నదని విశ్వసించురీతి జగదాశ్రింజకమై యలరారుచుండెను. ఆమె యొక సోఫాపై గూర్చుండెను.

ఇంతలో మామూలు సమయమునందున నాఫ్రికా మాంత్రికుడు పెద్దహాలులోనికి బ్రవేశించెను. తొలుదొల్త యామె కన్నుగవ నైగనిక్య మా దురాశా పాతకుని మానసము నాకర్షించెను. నిత్యవిధానముకంటె విరుద్ధముగానున్నయామె చిరునగవును శరీర సౌభాగ్యమును నాతని విజ్ఞానమునకు స్వస్తిచెప్పినది. అట్టితరి నావీరసాధ్వి, నేడు నాలోగల్గిన మార్పునకు నీవాశ్చర్య పడుచున్నట్లు గనబడుచున్నది. అలాఉద్దీను నాతండ్రి యాగ్రహ వహ్ని కాహుతియై యుండవచ్చు. అతని వియోగముపై నేనుజేయవలసిన విధిని నేను నెఱవేర్చినాను. నాకన్నీటి చుక్కలు అతనినిబునర్జీవితుని జేయజాలవు. వానికొఱకు నాజీవిత సౌఖ్యమును బలియిచ్చుట నాగరకుల లక్షణముగాదు. కావున నీవు నేటిరాత్రి నీ, నా యావేదనలకు శాంతిజెప్పుదము. ఈరాత్రి నీకొఱకు నేను భోజన మిచ్చుటనే సిద్ధము చేయించెదను

ఇదియేనీకు నాహ్వానము, నాయొద్ద చైనాదేశపు సారాయి దప్ప మఱియొండులేదు. నీవు ఆఫ్రికాదేశపు సారాయిని గొంత దెప్పించుము. నేటితో మనకష్టములు గట్టెక్కినట్లు భావించుదము. అని యా యవినీతిపఱునియెడ నమ్మకము గుదుర నిబ్బరముగా విసలాసముగా భాషించెను.

కృత్రిమాదర ప్రదర్శినియగు నావీరసాధ్వి మధు రాలాపంబుల నాలకించిన మహామాంత్రికుని మనశ్చాకచక్య ము త్రుటికాలములో డిందుపడినది. నతడు తనయొద్ద సర్వోత్తమమైన ఆఫ్రికా సారాయియున్నదనియు, అది రెండుసీసాల పరిమితి వఱకు నుండుననియు, దానినుంచిన కొట్టు బీగముచెవి తనయొద్దనుండుటచే దానే స్వయముగా బోయివచ్చెదననియు ముచ్చటించెను. మితిలేని యాతురము నభినయించుచున్న యామెయనుమతిపొంది తానే స్వయ ముగా బోయి యతిశీఘ్రకాలమున ఆఫ్రికాసారాయిని దీసి కొనివచ్చెను. అతడు పోయివచ్చునంతలో రాజసాధ్వి అలా ఉద్దీనొసంగిన చూర్ణమును దనచేతితో నొకగిన్నె చైనా సారాయిలో మిశ్రితముచేసి సిద్ధముంచెను.

అంత వారిరువురును విందుబల్లముందు గూర్చుండి పుష్కలముగా దినిన తరువాత లొట్టలువైచుచు, అత్యను కూల వాతావరణముతో ఆఫ్రికా సారాయిని చెఱిరెండు గిన్నెలమట్టము ద్రావిరి. అంతనామె అతివిధేయత నభిన యించుచు దన పరిచారికకు సంజ్ఞసేయ నాపరిచారిక రెండు

గిన్నెల చైనాసారాయినిడెచ్చి యిచ్చెను. చూర్ణమిశితమైన సారాయిగిన్నెను దనచేతనుంచుకొనెను. విడి సారాయి గిన్నెను మాంత్రికుని చేతికిప్పించెను. అట్టిక్షణమున చైనా దేశమున దంపతుల కలయికకు బూర్వము ప్రియురాలొసంగిన సారాయిగిన్నెను బ్రియుడును బ్రియుడొసంగిన దానిని బ్రియురాలును ద్రావుట యాచారమని ప్రేమరస పూరిత వీక్షణముతో సవినయము బల్కెను. చైనాదేశపు రాజకన్య కను నేడు దాననుభవింపబోవుచున్నవాడు గనుక తద్దేశాచారమే పరిపాటి సేయవలెనని నిర్ణయము సేసి ఆమెచేతి గిన్నెను దానందుకొని తనచేతిగిన్నె నామెచేతికిచ్చెను. ఆమె దానిని గ్రహించి గ్రీపెదవి కంటించుకొని మహానురాగ సంతోషములతోఁ ద్రాగబోవుచున్నట్లు నటించుచుండెను. అపరకాంతా భోగ పరాయణుఁడు ముందుగ ద్రావుటయే పురుషుని కర్తవ్యమని మూడు గ్రుక్కలతో నా ప్రాణాంతక చూర్ణమిశితమైన సారాయిని గుటగుట ద్రాగివైచెను. తుదిబిందువు గళమున బ్రవేశింపక పూర్వమే యతడు వెనుకనున్న కుర్చిపై జీవ శూన్యుడై వ్రాలెను.

అతని పతనమును గన్న పరిచారిక దొడ్డితలుపు తెఱచెను. అలాఉద్దీను రెండంగలలో పెద్దహాలులో బ్రవేశించెను, నిజభర్తను జూడగనే యాపరమసాధ్వి మహానందముతో గౌగలించుకొన బోయెను. అప్పుడతడు నారీమణీ!



మన స్థిర సౌఖ్యమున. కింకను వ్యవధియున్న ది. ఈ కాంచనరత్న సౌధమును జైనాదేశ మున బూర్వస్థానమున జేర్చు ప్రయత్నము సేయనిమ్ము. నీవు నీ యరలోని కేగు మని వారించి మృత మాంత్రి కుని శవము నొద్దకు బోయి వక్షస్థలముమీది యంగరకాను దొలగించి విచిత్రదీప పాత్రమును సంగ్రహించెను. వెంటనే దానినొరయించి రాక్షసునిబిల్చి. రాక్షస వర్యా మాదంపతులతోడను పరివారముతోడను నిండియున్న యీమణిభవనమును జైనాదేశములో, దానిపూర్వస్థానమున జెక్కుజెదరకుండ గొంపోయి స్థాపించుమని యాజ్ఞాపించెను. తృటిమాత్రకాలమున యసురుడట్లే యొనరించెను.

అలాఉద్దీను నిజసాధ్విని బిల్చి సతీమణీ మనయానందము రేపు ఉదయము వరకు సంపూర్ణత్వము నొందగలదని హెచ్చరించెను. పయనపు పరిశ్రమచే నలతగొన్న యీ పవిత్రదంపతులు రాత్రిభోజనము మనసారజేసి నిదురించిరి.

దినదినమును పుత్రికావియోగమున గృషించుచున్న సుల్తాను ఆమఱునాటి యుదయమున దన ప్రత్యేక మందిరమునకు బోయి, యొకసారి తలయెత్తిచూడ దనయల్లుని రత్నసౌధము తిరిగి కనబడినట్లయ్యెను. మంచుతెర కావచ్చునని యించుకతడవు సంశయించి కన్నుమ్మర చూచిచూచి, నిశ్చయమేనని నిర్ణయించి తన యశ్వరాజమును దెప్పించి యాతృతతో దాని నధివసించి రత్నసౌధ సింహద్వారమునకుబోయి నిల్చెను. అలాఉద్దీను మామకెదురుగవచ్చి స్వాగతమొసంగెను. సుల్తాను దొలుదొల్త నా ప్రేమరాశి యగు బుద్ధీరుల్ బుద్దూరును జూడనిమ్మని, కుమార్తెమందిరమునకు జేరెను. అపరిమితానంద చిహ్నముల గ్రిక్కుచున్న నవ్వుమొగముతో నెదురుగ వచ్చిన తనకుమార్తెను జూచి సుల్తాను ప్రేమమయాలింగనముసేసి! యానందబాష్పముల వదలెను. అంతనతడు చేతిరుమాలుతో గన్నుల నద్ది బిడ్డా ! నీవీమధ్యకాలమున మహా భయంకరములగు కష్టముల ననుభవించి యుందువు. కానిచో నింతటి మనోహర రత్నసౌధరాజము ఒక్కుమ్మడిగా నదృశ్యమై తిరిగి యిత్తావున నయనానందకరముగ నిల్వనేరదు. నీవేమియు దాపక ఈమధ్యకాలమున జరిగిన వృత్తాంతమంతయు సవిస్తరముగా చెప్పుమని యాకుమారి నడిగెను. చిరకాలము నుండి తనకొరకు పరితపించుచున్న కన్నతండ్రికి మనస్సం

తోషము గూర్పనెంచి తాననుభవించిన కష్టములను జెప్ప బూనెను.

కొలది నిమిషములకాలములో సుల్తాను అలాఉద్దీను దంపతులు ముగ్గురును నొక్క మందిరమున జేరిరి. అలాఉద్దీను వేటకుబోయినది మొదలుకొని తన్ను మోసగించి దీపపాత్రము నెత్తుకొనిపోయి సాధముతో దన్ను ఆఫ్రికా దేశమునకుజేర్చి తన పాతివ్రత్యమును భంగముసేయ జూచిన దుర్మార్గుడును మోసగాడును అవినీతి పరుడును నగు మాంత్రికుని మరణము వరకు దాననుభవించిన కష్టములనెల్ల బుడ్డీరుల్ బుద్దూరు తన తండ్రియగు సుల్తానుకు జెప్పెను. తరువాత వృత్తాంతమును అలాఉద్దీను జెప్పగలడని రాజపుత్రి మిన్నకుండెను. అంత నలాఉద్దీను తన కొసంగబడిన శిరచ్ఛేదశిక్ష రాజవిధివలన జేయవలసివచ్చి నందున దానికై సుల్తాను నిందనీయుడుకాడని సమ్మతించి కొదువ యంశములలోని చర్యలకు పలుసార్లు క్షమాపణవేడి మాంత్రిక వధావృత్తాంతమున దనభాగము విశదముగా సుల్తానుకు వినిపించెను. మాంత్రికుని శవమింకను హాలులో నున్నదనియు ప్రత్యక్ష సాక్ష్యముగ దానిని సుల్తాను సమీక్షింపవలయుననియు ముచ్చటించెను. అంత నంతటి దురాత్ముని శవమెట్లున్నదో చూడవలయునని సుల్తాను హాలు లోనికిబోయి దానింజూచి యాశ్చర్యము నొందెను. దానిని జూచిన వెంటనే "ఉత్తరక్రియ జరుపవలె"నని యాజ్ఞాపిం

చెను. అట్టి జగద్వంచకునకు దగిన యుత్తర క్రియగా భావించి వానిశవము నానగరమునకు ననతిదూరమున నున్న మలరాశి వరకు మోయించి దానిపైఁ బారవేయించి పక్షులకును గ్రూరమృగములకు దినుపదార్థముగా జేసెను.

అనంతరమున సుల్తాను మఱొకసారి నగరము నలంకరింపజేసి, వివిధ మధుర మంగళ వాద్యములు మ్రోవ నేర్పాట్లుచేసి కుమార్తెయు నల్లుడును కష్టానంతరమున క్షేమముగా వచ్చినందులకు కని ప్రజావళులను విందుల కాహ్వానించుచు బది దినములవరకు మహోత్సవముజరిపించి అటుపిమ్మట తన రాజ్యమును అలాఉద్దీనుకు పట్టాభిషేకము గావించెను. రాజకుటుంబము వారును బ్రిజలును మహానందమున నోలలాడుచుండిరి.



సంపూర్ణము.

కొండా శంకరయ్యగారి ప్రీమియర్ పవర్ ప్రెస్, సికింద్రాబాద్.



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA101B194 |
| పుస్తకం పేరు | అలాఉద్దీన్ అద్భుత దీపం కథ |
| తారీఖు | 02-10-24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 99 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Soumya |
| స్కాన్ చేసినది | prathyusha |
| పరీక్ష చేసినది | sandhya |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | NO |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |